79 జనవరి

87




విప్లవ రచయితల సంఘం వర్ధిల్లాలి !

విప్లవం వర్ధిల్లాలి !

# సృజన

**ఆధునిక సాహిత్య వేదిక**

మాసపత్రిక

నిర్వహణ

**'సాహితీ మిత్రులు'**

ంవత్సర చందా 15 రూపాయలు

ఈ సంచిక రు. 1-50 పైసలు

# సృజన

## ఆధునిక సాహిత్య వేదిక

మాసపత్రిక

**87**

**జనవరి 1979**

## సంజాయిషీ

అనివార్య కారణాలేమీ కాదు. ఒకే ఒక్క కారణంవల్లనే సృజన జనవరి సంచిక ఆలస్యం కావడం జరిగింది. పాఠకులకు ఈ ఇబ్బంది కలిగించక తప్పనందుకు క్షమించాలి. వరంగల్‌లో ప్రెస్సులన్నీ, లేనిచోట ప్రెస్‌వర్కర్లందరూ పంచాయితీ ఎన్నికల ఓటర్లజాబితాలు అచ్చేసే పనుల్లో కూరుకపోయారు. విజయవాడలోనూ వీలుకాలేదు. నెలాఖరుకుగానీ హైదరాబాదులో పని ప్రారంభం చేయలేకపోయాం. పాఠకులు, అభిమానులు ఈ అసౌకర్యాన్ని సహృదయంతో అర్థం చేసుకుంటారని ఆశిస్తున్నాం. విరసం సాహిత్య పాఠశాల సందర్భంగా ఈ సంచికను విడుదల చేస్తున్నాం.

—సాహితీమిత్రులు

నిర్వహణ

**' సాహితీ మిత్రులు '**

సంవత్సర చందా 15 రూపాయలు ఈ సంచిక రు. 1-50 పైసలు

ఈ సంచికలో......



**SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.**


**Edited, Printed & Published by P. Hemalatha for 'Sabithee Mithrulu' Printed at Ramesh Printers, Chikkadpalli Hyderabad-20, for Venkataramana Mudranalayam, Warangal**

**Working Editor : Varavararao.**

# విప్లవ రచయితల సంఘం వర్ధిల్లాలి!

జనవరి 13, 14, 15 తేదీల్లో విరసం తన సభ్యులకోసం, సానుభూతి పరులకోసం 'సాహిత్య పాఠశాల' నిర్వహిస్తున్నది. ఈ సాహిత్య పాఠశాల సందర్భంలోనే దాదాపు ఒక ఏడాదిగా తనలోతాను, నలుగురిలో తాను చేసుకున్న ఆత్మవిమర్శ చర్చ ఒక రూపానికి వచ్చి వెలువడనున్నది. నాకు తెలిసినంతవరకు ఒక ప్రజాసంఘం, అందులోనూ ఒక సాహిత్యసంస్థ ఆత్మవిమర్శకు పూనుకోవడమే ఇది మొదటి ఉదాహరణ. ఇది కూడ రెండు రంగాల్లో జరిగింది-అంతరంగంలో, బహిరంగంగా. తనలోతానూ బయటి ప్రపంచంతోనూ చేసే అంతర్బహిర్ యుద్ధరావమే కవిత్వమన్నాడు చెలం. అట్లా తన మీద తాను నిర్దాక్షిణ్యంగా, నిర్మొహమాటంగా, నిష్కర్షగా విమర్శ చేసుకున్నది - ఇతరుల విమర్శలను 'వినదగునెవ్వరు చెప్పిన......"అన్నట్లు విన్నది. అర్థం చేసుకున్నది, ఆకళించుకున్నది, అవసరమైన విమర్శలు స్వీకరించింది.

తెలుగు దేశంలో నక్సల్బరీ, శ్రీకాకుళ పోరాటాలు ప్రజారాజకీయాలను, శత్రురాజకీయాలను నిగ్గుతేల్చి వేరు చేసిన తర్వాత ఏర్పడిన మొట్టమొదటి ప్రజాసంఘం విరసం. అది కూడ ఒక చారిత్రక దశలో అనివార్య పరిణామంగా ఆవిర్భవించిందనే విషయం అర్థంచేసుకుంటే మార్క్సియన్ సోషలిజం అనే మాట ఆనాడూ ఆ మాటనే స్పష్టమైన ఆధునిక శాస్త్రీయ నిర్వచనంగా మార్క్సిజం-లెనినిజం, మావో ఆలోచనావిధానంగా ఈనాడూ తన ప్రణాళికలో విరసం ఎందుకు ప్రకటించుకున్నదో స్పష్టమవుతుంది. విరసం ఏర్పడిన నాటికి కాదు, ఈ నాటికీ విప్లవ రచయితకు కుహనా అభ్యుదయరచయిత నుంచి, అవకాశవాద సామ్రాజ్యవాద వ్యతిరేకి నుంచి విస్పష్టంగా వేరుగా తన విలువలను నిరూపించుకోవాల్సి వున్నది. అమెరికన్ సామ్రాజ్యవాద వ్యతిరేకత కొందరి అభ్యుదయానికి అర్హతగా, రష్యన్ సామ్రాజ్యవాద వ్యతిరేకత సరికొత్త అభ్యుదయానికి అర్హతగా చెల్లుబాటు అవుతున్న ఈనాడు ఉభయ సామ్రాజ్య వాద వ్యతిరేకత ఆర్థిక, వాణిజ్య రంగాల, రాజకీయ బలాబలాల అవసరాలు, వ్యూహాలనుబట్టి నిర్ణయమవుతున్నది. అంతకన్నా నూతన ప్రజాస్వామ్య విప్లవానికి మార్గదర్శకమైన తాత్త్వికధోరణి మావో ఆలోచనా విధానాన్ని విరసం స్వీకరించడం తను నిర్వహించవలసిన సాహిత్య కర్తవ్యానికి తగినపని.

సాహిత్యరంగంలోనే కాకుండా పౌరహక్కుల ఉద్యమంలో కూడ విరసం నిర్వహించిన, నిర్వహిస్తున్న పాత్ర ఎన్నదగింది. శ్రీకాకుళ పోరాట కాలం నుంచి కరీంనగర్, ఆదిలాబాదు పోరాటాల దాకా ప్రజాపోరాటాలకు

బాసటగా విరసం ఎప్పుడూ ఎర్రజెండాను మరింత సమున్నతంగా ఎగిరేస్తున్నది.

విరసం బలాన్ని సభ్యుల సంఖ్యతోనో, తప్పులతోనో అంచనా వేసే వాళ్ళు దాని ప్రభావాన్ని, ప్రజల్లోకి అది తీసుకపోతున్న విప్లవ సందేశాన్ని గ్రహించలేనివాళ్ళు. ప్రజలపై తన ప్రభావం ప్రగాఢంగావున్నది. కాబట్టే విరసం విప్లవ బాధ్యతను మరింత సమర్థవంతంగా నిర్వహించడానికే ఆత్మ విమర్శ చేసుకుంటున్నది. విమర్శ-ఆత్మవిమర్శ అనే శాస్త్రీయ సూత్రం ప్రాతిపదికగా పనిచేస్తుంది. పురోగమిస్తుంది.

విప్లవం వర్ధిల్లాలి! విప్లవ రచయితల సంఘం వర్ధిల్లాలి

1 జనవరి 1979 —సంపాదకుడు

## స్టాలిన్

మార్క్సిస్టు మహోపాధ్యాయుడు, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమనిర్మాత, బోల్షివిక్ పార్టీ కంటి వెలుగు కామ్రేడ్ జుగాష్ విలీ స్టాలిన్ శతజయంతిని శ్రామికవర్గం ప్రపంచ వ్యాప్తంగా వర్గపోరాటాల ఎర్రజెండాకు జీవగర్రగా, సామ్రాజ్య వాదానికి కన్నెర్రగా జరుపుకుంటున్నది. బోల్షివిక్ విప్లవ విజయాన్ని సామ్యవాద అభివృద్ధివైపు నడపడమే కాకుండా, ప్రపంచయుద్ధ ప్రమాదం నుండి కాపాడిన సోవియెట్ క్యాప్టెన్ స్టాలిన్. లెనినిజాన్ని సామ్రాజ్యవాద చరమదశ కాలపు మార్క్సిజంగా నిర్వచించి, వివరించి, విశ్లేషించిన తత్వవేత్త. భాషను, జాతిని, సంస్కృతిని శాస్త్రీయంగా పరిశీలించి కొత్తవెలుగులు ప్రసరించిన సామాజిక శాస్త్రవేత్త. బోల్షివిక్ పార్టీ చరిత్రను మౌలికమైన మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాలన్నీ యిమిడ్చి రచించిన అద్వితీయ చరిత్ర కారుడు. బతికినంతకాలం నాజీ నియంతలను, ఫాసిస్టులను, సామ్రాజ్యవాదాలను నిద్రపోనివ్వలేదు.మరణించినాక రివిజనిస్టులు తన నామరూపాలు లేకుండా చేయాలని ప్రయత్నించి చరిత్రను తిరుగ రాసినపుడు చచ్చిన చరిత్రలో సజీవంగా రోజురోజుకూ పునర్నవిస్తున్నాడు. కామ్రేడ్ స్టాలిన్ సజీవస్మృతికి సృజన జోహార్లుఅర్పిస్తున్నది.

—సంపాదకుడు

కృశ్చెవ్ పైట్లు......
స్టాలిన్‌ను పూడ్చి చంపామని
చంకలు గుద్దుకుంటున్నారు
కాని యివ్వాళ......
సోవియట్ ప్రజల ప్రతిఘటనలోనే కాదు
ప్రపంచ పీడిత ప్రజల వర్గ పోరాటంలో
ప్రవహిస్తూ వెచ్చగా జీవిస్తున్నాడు.

# సెల్లెవ్వ శపథం - భారతీ కిరియాల

ఎ. వి. గద్దర్

| | | | |
|---|---|---|---|
| నా కూలినాలన్నాలు | | నా కూలినాలన్నాలు | |
| బావుల్ దొవ్వంగో | ॥భారతీకిరియాల॥ | కోతల్ గొయ్యంగో | ॥భారతీ॥ |
| బావుల్ దొవ్వంగో | ,, | కోతల్ గొయ్యంగో | ,, |
| బాయి బాయికి నేను | | కోతకోతాకు నేను | |
| బతుకమ్మనాదో | ॥భారతీ॥ | కొడవలౌదునో | ॥భారతీ॥ |
| బతుకమ్మనాదో | ,, | కొడవలౌదునో | ,, |
| నా కూలినాలన్నాలు | | నా కూలినాలన్నాలు | |
| మోటల్ గొట్టంగో | ॥భారతీ॥ | కట్టల్ గట్టంగో | ॥భారతీ॥ |
| మోటల్ గొట్టంగో | ,, | కట్టల్ గట్టంగో | ,, |
| మోటమోటకు నేను | | కట్టా కట్టాకు నేను | |
| దండెడౌదునో | ॥భారతీ॥ | పంటానౌదునో | ॥భారతీ॥ |
| దండెడౌదునో | ,, | పంటానౌదునో | ,, |
| నా కూలినాలన్నాలు | | నా కూలినాలన్నాలు | |
| నీల్లు గట్టంగో | ॥భారతీ॥ | కుప్పల్ గొట్టంగో | ॥భారతీ॥ |
| నీల్లు గట్టంగో | ,, | కుప్పల్ గొట్టంగో | ,, |
| గట్టూ గట్టూకు నేను | | కుప్పా కుప్పాకు నేను | |
| గన్మ నౌదునో | ॥భారతీ॥ | రాసినౌదునో | ॥భారతీ॥ |
| గన్మ నౌదునో | ,, | రాసినౌదునో | ,, |
| నా కూలినాలన్నాలు | | నా కూలినాలన్నాలు | |
| వొరము చెక్కంగో | ॥భారతీ॥ | బండ్లూ నింపంగో | ॥భారతీ॥ |
| వొరము చెక్కంగో | ,, | బండ్లూ నింపంగో | ,, |
| వొరము వొరమూకు నేను | | బండీ బండీకి నేను | |
| పారనౌదునో | ॥భారతీ॥ | బండిరుసు నౌదో | ॥భారతీ॥ |
| పారనౌదునో | ,, | బండిరుసు నౌదో | ,, |
| నా కూలినాలన్నాలు | | నా కూలినాలన్నాలు | |
| దుక్కుల్ దున్నంగో | ॥భారతీ॥ | కత్తూలెత్తంగో | ॥భారతీ॥ |
| దుక్కుల్ దున్నంగో | ,, | కత్తూలెత్తంగో | ,, |
| దుక్కీ దుక్కికి నేను | | కత్తి కత్తికి నేను | |
| మొక్కనౌదునో | ॥భారతీ॥ | వోరనౌదునో | ॥భారతీ॥ |
| మొక్కనౌదునో | ,, | వోరనౌదునో | ,, |

నా కూలి నాలన్నాలు
దండులో చేరంగా ॥భారతి॥
దండులో చేరంగా ,,

ధండూ దండూకి నేను
ఎఱ్ఱజెండ నౌదునో ॥భారతి॥
ఎఱ్ఱజెండ నౌదునో ,,

---

## కల్లాకపటం తెలియనివాడా!

'సమతశ్రీ'

కల్లాకపటం తెలియనివాడా ఓ కూలన్నా!
నువ్వెల్లకాలం సేవచేసినా ఫలితం లేదన్నా
గానుగలాగే ఎద్దులాగ మోటమీది మొద్దులాగ
ఉన్నవాళ్ళ బరువుభారం మోసుకుంటు జీవించేవు!
అడ్డమైన చాకిరంతా గడ్డ బలిసిన దొరకు చేసి
పొద్దు తప్పి సద్దికూడు మింగి ముంతెడు నీళ్ళుతాగి
మద్దెలో కండ్లకు సీకటొచ్చి దుక్కి లోన యిరుసుకపడి
వూపిరాడక పూరుకున్నావా-ఆరోజునీకు
నాగ గడితే ఏడుస్తున్నావా-ఆరోజు
యింట్లో పిల్లిలేపక పస్తుపన్నావా ॥కల్లాకపటం॥
నర్సిమ్మసామికి ముడుపుగట్టి దేవుని గుళ్ళో దీపంబెట్టి
వంగిమొక్కే పటేలోడు నిదురపొద్దుకు నిన్నులేపి
'నర్సిగా ఓ లంజెకొడుక'ని చెడ్డకూతలు గూసె వాని
నాలుకే కోసెయ్యాలంటావా-ఓ జీతగాడా
సద్ది విరగదన్నాలంటావా - ఓ జీతగాడా ॥కల్లాకపటం॥
అయ్యజేసిన బాకి కింద. పెళ్ళికైన అప్పుకింద
ఆరుగాలం జీతముండి. అసలు బాకీ చెల్లగట్టి
పడ్డి కింద నీ బిడ్డణ్ణి బర్రెదుడ్డెల గాయదోళ్ళి
ఆత్మలోనే కుములుతున్నావా-ఓ జీతగాడా

ఆశ్లలన్నీ చంపుకున్నావా -ఓ జీతగాడా ॥కల్లాకపటం॥
బాయిదోడితె లేని ముట్టు నీళ్ళ కాడ వుంటదంట
కుడితి దాపితె లేని ముట్టు పాలకాడ వుంటదంట
పడ్లు దంచితె లేని ముట్టు బువ్వకాడ వుంటదంట
ముట్టువుంటే బర్కతంటూ ముద్దుమాటలు చెప్పుకుంటు
ఏలుకేలుకు తేడ "దేవుడు పుట్టినపుడే రాసె" నంటూ
మూగజీవులు కష్టబోతులు ధారపోసే ఎరుపురక్తం
పీల్చుకు తాగుతు బలిసే జలగలురా-ఈ దోపిడీదొంగల
ఎదురించక దారిదొరకదురా- ఈ దోపిడీదొంగల
గద్దెదించక బతుకే పారదురా
కల్లాకపటం తెలియనివాడా ఓ కూలన్నా
నువ్వెల్లకాలం దున్నే భూమే సొంతం నీదన్నా!

## ఎవరి సొత్తు

**దాశరథి రాములు**

కృష్ణా గోదారులు
తుంగభద్ర పెన్నేరులు
ప్రవహించే భూమిలోన
పంటచేలు ఎవరిసొత్తు!
బొగ్గుగనులు ఇనుపగనులు
మాంగనీసు అభ్రకాలు
పొదిగిఉన్న భూమిలో
ఫేక్టరీలు ఎవనిసొత్తు?
అడవితల్లి కల్పవల్లి
కనిపెంచిన చెట్టులెల్ల
పుడమితల్లి పాలవల్లి
పశుజాతి ఎవనిసొత్తు?
ధనధాన్యం సృష్టించే
కష్టజీవి కర్షకుడా!
కడుపునిండా తిండిలేక
కనలి కనలి చావనేల?
పంటచేల దొరబిడ్డల
ఫేక్టరీల యజమానుల
ఎర్రజెండ నీడలోన
ఎదురిస్తే నీసొత్తు.

# హమాలన్న...

చెరబండరాజు

హమాలన్న కూలన్నా
అడ్రసేందో జెప్పన్నా
ఏమార్కెట్టేమిల్లో
ఏ టేషన్ కాడుంటవో ॥హ॥

పెయ్యంతా చెట్టోలె
చెదలు పట్టినట్టుంది
సందులేక కమిలి కమిలి
సల్లగయ్యినట్టుంది ॥హ॥

యీపుమీద బియ్యంసంచి
కడుపేమొ ఖాళీసంచి
పెట్టెలు హోల్డాలు మోసి
నడ్డిపూస యిరిగిపాయె ॥హ॥

బండిమీద నువ్వుంటవో
నీమీదే బండుంటదొ
బస్తలల్ల బస్తైతివి
బతుకే బాజారుగాంగ ॥హ॥

గింజగింజ లెక్కగట్టి
సేటుగాడు కాంటేస్తడు
కిలోల్లెక్క కూలడిగితె
ఆడు బతుకు కాటేస్తడు ॥హ॥

చెత్తా చెదారమంత
లారి లోడు చెయ్యాలె
దొంగసరుకు దొరలసరుకు
లారి దించి మొయ్యాలె ॥హ॥

అంగట్లో అన్నుంటై
సినోట్లో మన్నుంటది
నడుంగట్టి జబ్బచరిచి
నడిస్తేనే బతుకుంటది ॥హ॥

---

నవల-సీరియల్

# కొలిమంటుకున్నది

—అల్లం రాజయ్య

[గత సంచిక తరువాయి]

## 3

పొద్దు పడుమటి గుట్టల్లకు జారిపోయేటందుకు తయారుగున్నది. లేసిన కాన్నుంచి తిరిగిన పచ్చులు పల్టీలు కొట్టుకుంట, లొల్లి సేసుకుంట సెట్ల మీనికి సేరుకుంటన్నయ్. సెరువుల తడలు తగ్గి నీల్లు కదలకుంటయిపోయినయ్... నీల్లమీన సిన్న సిన్న సేప పిల్లి లెగుర్తున్నయ్... పడుమటి ఆకాసం ఎర్ర సెక్కెలి సెరువుల కనపడ్తంది. సెరువు కట్టమీన గౌండ్లోల్లు తాటి సెట్లు ఎక్కుతంటె మోకు సప్పుడయితంది... సెరువు కింది పొలాలల్ల కొంగలు మూతులు ముంగటికి బెట్టి ఎగురుతన్నయ్... కొన్ని కొంగలు కట్టకొమ్ము తుమ్మ సెట్టు మీన "కావురు కావురు" మనుకుంట పొడుసుకుంటన్నయ్. ఎవడో గౌండ్ల పడుసోడు తాడుమొగిల లొట్లు కట్టుకుంట లెల్లెపాట పాడ్తండు. ఆసి పాట ఎక్కడికో ఉండుండి ఇనత్తంది. తూముకాడి సాకిరేవు దగ్గర సాకలోల్లు బట్టలు ముల్లెలు గట్టుకుంటండ్రు... పనై పోయిన ఆడోల్లు సెరువుల కుండలు బోర్లేసు కొని ఈదుకుంట పరాసికాలాడుకుంటండ్రు. అందట్ల ఎవతో ఎర్రసీర నీల్లమీన పరిసి సందమామ సాపల పడ్తంది. తూముల్నుంచి నీల్లు "బొయ్యి" న కాలువల పడ్తన్నయ్... కాలువల దూరంగ ఎవడో బురదల సాపలు పడ్తుండు.తూమ్మీన మీసాలు మొలువని పిలగాడు గాలం సువ్వ పట్టుకొని నీల్ల మీనిబెండుమునుగా తేల గాభరా పడిపోతండు...

సెరువు కట్టమీన "సవారి బండి" గురగుర సప్పుడు సేసుకుంట ఉరుకుతంది... కోల్లాగెల మెడలల్ల గజ్జెపేరు గమ్మతిగా మోగుతంది. తుప్ప తుప్ప ఊంచుకుంట - ఆరుతోని సిలసిల ఎడ్లముడ్ల మీన సరుసు-కుంట-పెరిగిన అరి పొలాల సూసుకుంట బండ్లెదొర కూకున్నడు...

ప్రతాపరెడ్డిదొర పగ్గాలు బిగబట్టిండు. కయిలికోడె సిర్రుకొట్టుకున్నది. బూత అంకూసుది బుద్దిగ నిలబడి నడ్డిరిసింది...

ఆగిన బండ్లె నుంచి దొర పడదునికిండు... ధోతి సరిసేసుకున్నడు. ఆ కొస నుంచి ఈ కొసదనుక సూపు పోనిచ్చి ధీమగ గాలి తీసుకున్నడు.

కట్టకింది పొలంల కాలువకు ముద్దగ డ్తన్న నీరటికాడు నొసలుకు సెయ్యడ్డం బెట్టి కట్టమీనికి సూసిండు. మన్ను తవ్వే కత్తువ కాలువ దట్టమీన

పారేసి - సేతులున్న మట్టిముద్ద దట్టకు సరిసి కాలువల సేతులు కడుక్కొని తల రుమాలు ఊడబీకి భుజం మీనేసుకొని అదర బాదర కట్టమీని కురికచ్చిండు.

"దండాల్ బాంచెన్..." దొరకు దూరంగ నాలెను తాకి మొక్కి వొరకు నిలబడ్డడు...

"బొత్తోడ... బరాబరి నీల్లందు తన్నాయిరా ? అగో జువ్వి పంపు ఎరుపు ధాతు కచ్చింది... గొట్టం రోగంగిన తాకినాదిరా ? పసిపోరగండ్లోలె సూసుకోవాలె- సెనం సేపు మరుసుంటే ఎండి ఎరగప్పయితయ్... ఇన్నావురా ? జెరపెయిల భయముంచుకోవాలె- ఇగో రేపే మొండోనికి జెప్పుత మందు జల్లియ్యి... ఇంటన్నావురా ?"

"ఇంటన్న బాంచెన్... గింతవరదాకనైతే నీల్లదెబ్బతాకనియ్యలే. అయింక ఎండలు ముదిరినంక జరంత గొటగొటయితదండాలె బాంచెన్- మొన్న బాలమల్లు పటేల్‌కు జెప్పిన- ఊరియ జల్లియ్యాలెనని... కంకి ఝాడిచ్చి ఇడుత్తది బాంచెన్..."

"తూము కప్పుమీన ఇంకెన్ని నీళ్ళున్నయిర..."

"మా అంటె మూడు జాన్లుండచ్చు బాంచెన్... సెర్ల ఆడాడ కోపులు దేల్తన్నయి గద... మూడుతూములు ఏకరాజ్జెంగ నడువ వట్టె... పొట్టకచ్చింది గాదుంగ్రడి. అడ్డువాంస్ నీల్లుండకపోతే ఇరుకబడతయ్..."

"కడుమ లంజకొడుకులేడబోయింగ్రడు. నువ్వొక్కనివే ముద్దగ త్తన్నవ్... నీరటికాల్లకు కండ్లు నెత్తికెక్కినయ్ బంచత్..." తుపుక్కున ఊంచి దొర బండెక్కిండు.

సేతులున్న ముల్లుగట్టె ఆరు గాలిల "సెల్" మన్నది. బండి కదిలింది.

బండి ముంగట నిలుసున్న సుంకరోడు కాల్లేపిండు.

ఉరుకుతున్న బండెనుక బొత్తయ్య కొంతదూర మురికిండు.

"బాంచెన్ దొర! ఇంట్ల సారెడిత్తులులేవ్... కూటికి గొటగొటయితంది. నీకాల్ మొక్కుత..." బొత్తయ్య మాటలు గజ్జెపేరుమోతల కలిసినయ్.

దొరకు ఇనచ్చినా! మాట్లాడలే...జవాబుగా సేతుల ముల్లుగట్టెకయిలికోడె ఊపుమీన సటేల్‌న తాకింది...కయిలికోడె సుంకరోని మడిమెలు దొక్కింది.

బొత్తయ్య బండెనక్క పడ్డడు... ఎంతురికిన బండి అందలేదు... బండి లేపిన దుమ్ము మొఖమంత పారింది...పొగతీర్గ బండెంట కనిపిత్తన్న దుమ్మును సూసుకుంట భీరిపొయ్యి నిలుసున్నడు...

"నాత్రి పగలు కంట్లె కనిపాపలు జంపుకొని, ఇంట్ల పోరగండ్ల నిడిసి పెట్టి- ఈళ్ళ పొలాలు పసిగుడ్లోలె సాదుకరావాలె- ఆకలై జీతమడుగుతె

పుణ్యానికిచ్చినట్టు మీదికెల్లి ఎక్కల్లేని కోపాలు... నెలనెల జీతాలియ్యకుంటె నీరటీ లంజకొడుకులెట్ల బతుకుతరను కుంటం్రడో? సత్తె అడె సచ్చె... అని పోరగండ్లే తండ్రి లేనోల్లయిపోయిరి... దొరదేం పోతంది..." కాల్లీడ్సుకుంట, తనండ్ల తనే గులుక్కుంట అర్నెల్ల మంచాల పడ్డోనితీర్గ ఇందాక తనిడిసిపెట్టిచ్చిన పనికాడికి నడిసిండు.

బండి సెరువు కట్టమీన జోరుగ ఉరుకుతంది...

రెండోతూముకాడ మల్ల బండాగింది. దొర బండిదిగి తూముమీన నిలుసుండి నల్లల్లకు పారసూసిండు...

"సెర్లల్ల కొంగోలె నువ్వున్నవయ్యో!
నువ్వున్నవయ్యా!
సేమంతి పువ్వోలె నేనున్ననయ్యో!
నేనున్ననయ్యో!

కట్టకిందినుంచి ఎవలదో అడిగొంతు తీగె తీర్గె రాగంతీసి పాడ్తంది ... కాల్లు నీల్లల్ల "జిలుక్...జిలుక్" మనంగ సప్పుడు సేసుకుంట నడిత్తన్నట్టున్నది...

దొర కట్టమీనికచ్చి... మెడెత్తి కట్టకిందికి నిక్కిసూసిండు. ఈతగుంపులు తప్ప ఏం కనిపియ్యలే ...కాలువొడ్డు ఈతసెట్టుకు పదిపిట్టగూల్లు ఏలాడ్తన్నయ్ గూళ్ళమీన కూకుండి ఊరబిసికలు "కిసకిస" మంటన్నయ్...పాటైతే ఆగింది కనిసన్నంగా రాగం ఇనత్తంది... దొర రాగమత్తన్నకెల్లి పరిచ్చబట్టి సూసిండు...

ఎవతో ఎర్రకోకది నెత్తిమీన గడ్డిమోపెత్తుకొని కాలవల నీళ్ళను తన్నుకుంట కట్టకెల్లి అత్తంది... కాళ్లు, నడుం తప్ప మొఖం కన్పిత్తలేదు... గడ్డిమోపు మీన ఎర్రగాజుల సెయ్యి- కట్టుకుసెక్కిన కొడవలి కన్పిత్తంది...

"ఎవతివే...?" దొర గద్దరాయించిండు...

పాట టక్కున ఆగింది. నీల్లల్ల కాళ్ళు తడబడ్డయ్. గడ్డిమోపుకింది నుంచి పచ్చటి మొఖం కట్టమీనికి సూసింది. నెత్తిమీని గడ్డిమోపు కాలువొడ్డుకు ఎత్తేసింది... ఎత్తేసి ఎనకకు తిరిగి ఉరుక బోయింది...

"ఎవతివే?... గిట్లరా..."

ఉరకబోయినామె కాల్లకు పాము సుట్టుకున్నట్టుగ ఆగింది... గజ గజ అనుక్కుంట ముంగటికి నడిసింది...

"నీ బాంచెన్ దొరా ! మీదాంట్ల కొయ్యలేదు దొరా ! నీ కాల్ మొక్కుత దొరా ! ఈనుగుంట తొవ్వ సాపుగున్నదని అత్తన్నదొర".

దొర అనుకుతన్న ఆడిదాన్ని ఏడేడ సూడకూడదో అడాడ సూత్తండు. గట్ల సూసి మొఖం మీనికి కోపం తెచ్చుకున్నడు... ఎందుకనో తలకాయ ఊపిండు... మనుసుల ఏందో అనుకున్నడు.

దొర ఇసారం తెలుసుకున్న సుంకరోడు మొఖం మాడ్సుకొని... ఊరు దిక్కు నడిసిండు.

"ఎంకీ" దొర అతిలావు పేమతోని పిలిసిండు...

గుడిసేపు ఏం మాట్లాడకుంట నిలుసున్నడు...

అసలే భయంతోటి అనికిపోతన్న ఎంకమ్మ దొర తిట్టనందుకు మరింత భయపడ్డది... మనుసుల... "ఏ దుర్ మూర్తాన లేసిన్నో? ఏముదినట్టపు మొఖం సూసిన్నో ? మునిమాపటేల్ల దొరకంట్లెబడ్డ ... కానకపోతి కంపలిరుక్కుంటి... "ఎంకీ" అని గారువాల పిలుపు పిలిసిండంటే ఏందో మూడిందన్న మాటే? "ఎంకిలంజె" అని తిట్టిన బాగుండు. నాలుగు రోత మాటలు ఒట్టి తన తొవ్వతనెల్లి పోతే... పీడబాసిపోవు. అంతకోపమత్తె సేతులున్న ఆరుగట్టందుకొని కొట్టినా బాగుండు... సముర్తయిసంక అరి కల్లంకాడికి అయ్యకు అంబలి గొంటబోతె... తొలుదొల్త కిందికి మీదికి గిట్లనే సూసిండు. సూసిన మూడో నాటికి నాశిడంసేసి ఇడిసి పెట్టిండు... గట్ల ఇడ్సిపెట్టైనా ? తన మానాన తను గుడ్లల్ల నీల్లు గుడ్లల్ల కుక్కుకొని- కడుపుల సౌద కడుపుల్నే ఉంచుకొని, అత్తగారింటికిపోతే... ఎర్రెకండ్లు తన మీన్నుంచి తప్పియ్యలే- మొగన్ని మంట్లెగలిపేదనుక ఒక్క పట్టుబట్టిండు... అన్ని తన్నులు దిని రాయోలెరపోలె తిరిగి తిరిగి ఏడికి బొయిన ఏడే మానుకలు కాంగ పుట్టినూరికే సేరుకొని... కలో గంజో తాగి బతుకుతన్న - మల్లేం రానున్నదో?" పాత సంగతులు కదిలి భయంతోటి కట్టెతీర్గ బిగుసుక పోయింది.

కాలువల నీల్లు సల్లగా... జల జల ఒళ్ళంతా పాకి నెత్తిమీని కెక్కుతన్నట్టుగ అని పిచ్చి ఎనకకెనుకకు నడిసి ఈత సెట్ల సాటుకు తప్పుకోవాల్ననుకున్నది.

"ఎంకీ ఏడబోతన్నవే... నీతోని పనిబడ్డది..." దొర ముసి ముసి నవ్వుకుంట పిలిసిండు.

పిల్లికి సెలుగాట్కం ఎలుకకు పానసంకటం...

ఎంకమ్మ ఇంక తప్పక ఆగిపోయింది...

పొలాలల్ల ఒంటిగ నిలబడిపోయిన ఏలుపమ్మ ఇప్పమీన్నుంచి ఎందుకనో "కిక్కిరీ కిక్కిరికీ" అనుకుంట సీతుపలేసిపోయింది...

"దొరకన్ను పడనే పడ్డది..." ఎంకమ్మ నాలెసూపులు సూసుకుంటనే

"నేనియాల ఓరకున్న బాంచెన్..." ఎవలో పొత్తు కడుపుల సెయ్యేసి పిండు తన్నట్టుగా అన్నది...

"అదిగాదె లంజె..."

దొర గుడిసేపు తలగోక్కున్నడు. అట్టిగనే సేతులున్న అరుగట్టె ఝాడిచ్చి దులిపిండు ధోతి సరిజేసుకున్నడు. ఏడ మొదలు బెట్టాల్నో ఎరుకలేక...

"గ నర్సిమ్మడులేడు... గ ఒంటి నాగలి నర్సిమ్మడు..." ఎంకమ్మ మొఖం మీన్నుంచి సూపులు తాడిసెట్లమీనికి మలిపిండు. తాడిసెట్టుమీన దొరను సూసి "దిగన్నా! అద్దా!" అని ఇరుకాటంల పడ్డ గౌండ్ల సిన్నోడు మోకు ఎన్ను కానించి కాల్లుబారజాపి సిలుసుండి పోయిండు. "అంబటాల్లకే సూసిన నర్సన్న కేమయిందో?" మనుసుల ఎంకమ్మ.

"ఇగో...మూడె ముచ్చెట్లు... ఎంకీ ! గ నర్సిమ్మడు పొలంకాడ కొంగు బట్టి గుంజిండని రేపొద్దుగాల నలుగుట్ల సెప్పాలె..." ఎటు కెళ్ళో సూసుకుంట దొర అలుకగనే సెప్పిండు.

తనెంత సెడిపోయిందయిన బజారు కెక్కలే... తన బతుకు కుక్కలు సింపిన ఇత్తారయిన కడుపుల సెరిపెడు దుఃఖం దాసుకొన్నది. కులమోల్లు, సూసినోల్లు, పట్టినోల్లు, ఇరుగోల్లు, పొరుగోల్లు సూటి పోటి మాటలతోని కాకు లోలె, గద్దలోలె పొడువంగ రాయోలె రవ్వోలె - భగవంతుడా ! నీ గుల్లె రాయి పడ నాగ్గింతే రాసినవని కట్టమెల్లబోత్తంది... ఇంట్లోన్ని బజాట్ల కీడువమని, దేవునసొంటోన్ని దయ్యమనిసెప్పమని దొర - వూరు మాలుకుదారు... గడ్డ రాయించి ఖరాఖండిగ సెప్పుతండు... తన అయ్యసొంటోనికి గీ పాపం ఎట్ల అంటగట్టాలె... గీ పాపం సేసేకంటె అద్దుమ నాత్రి నిట్టాడుకు కొంగు మెడ కేసుకొని ఏలాడ్తె నయం... పాము నోట్లెబడ్డ కప్పతీర్గయి పోయింది బతుకు".

ఎంకమ్మ అంచిస తలెత్తకుంట తన ఇసారాలు దొరకు కన్పియ్యకుంట నీల్లల్లకు సూత్తంది.

"ఇగో ఎంకీ ! ఎనకముందు సెయ్యకు... కుంటకింద అరెకురం పొల మిత్త - ఆడకాదంటవా ? ఇగో గీ సెరువు కిందనే నువ్వోరుకున్నకాడిత్త" దొర బేరం పెడ్తండు.

"అరెకురం పొలమిత్తడట- ఎందరికిచ్చిండు?..." నర్సన్నను నిలువుత బొంద పెట్టెటందుకు అరెకరం పొలం ఆశసూపుతండు... దొర కప్పగాల మసొంటోడు... నర్సన్న సేసిన నేరమేందో ? ఎందర్నో గడీలల్లకు పిలిసి తోలు పికులగొట్టి సత్తె బొందబెట్టిచ్చిన దొరకు గీ దొంగనాటకమెందుకో ? దొర తల్సుకుంటె నర్సన్న రేపీయేల్లకు మల్ల మంచి నీల్లడుగకుంట సెల్లిపోడా ? అనాడు గంత మొత్తుకున్న నర్సన్నను దొరెందుకిడిసిపెట్టిండు...? జబరద స్తీగా

కంఖాలు పీకిచ్చిన దొరకు ఒంటినాగలిగాడు అడ్డమా ?

కాలం రావాలె - ఎనక ముందు దడిగటాలె - గప్పుడు... పులి అమాంతం మేకను ఇరుసుక తినేదైన సతికి సతికి మీన దూకుద్ది... పిల్లి కోడి పిల్లకు నాసు పెడ్తది. గద్ద గత్తి తిరిగి తిరిగి కోడి పిల్లల తన్నుక పోది... సందుదొరుకాలె- అమురబట్టాలె..."

ఎంకమ్మ గిట్ల అంతు పొంతు లేకుంట ఇసారిత్తంది.

"మూగ దయ్యమోలె ఉలుకవ్ పలకవేమె ఎంకిలంజె..." దొర...

ఎంకమ్మ ఉలికి పడ్డది.

"నీ బాంచెన్ దొర - దరప దొరలు - గులాపు దాన్ని కాని పని జేయిమంటంద్రు"

"కానిపనో ? అయిన పనో ? నా కెరికలే ... నేం జెప్పినట్లినకుంటే... ఎరికే గద... ఎందుకులే... రేప్పంచాయితి ... యాదికుంచుకో..." దొర బండెక్కిండు...

బండి కదిలింది...

తాడిసెట్టుమీని గౌండ్లోడు గప్పుడు "టుక్క టుక్క" మోకు సరుసుకుంట తాడు దిగిండు...

"నాగుంబాముకు పడిగెకిసముంటది... దొరలకు పెయ్యంత ఇసమే..." మీదికే అనుకుంట - గడ్డిమోపెత్తుకున్నది...

తత్తరపడే అడుగులతోని, గుబులు నిండిన గుండెలతోని గుడిసెవారి పట్టింది...

"అంబా" అని ఒర్రుకుంట, దుమ్ము లేపుకుంట- మెడలకు గట్టిన బొనుగల నూపుకుంట పసురాలు ఊళ్ళెజొచ్చినయ్—

తూరుపు నుంచి సీకటి పసురాల తరుముకత్తంది...

* * *

## 4

గీ నాత్రి గిట్లనే ఉండిపోతే బాగుండు ననుకొన్న ఎంకమ్మను దగాచేసి తెల్లారింది... పిట్టలు పీసుపీసుమన్నాయి. ఆవులు లేగలనొదిలి బీళ్లల్ల కెల్లిపోయినాయ్ ...సడీసప్పుడులేని ఊరు సందట్ల పడ్డది...

ఎంకమ్మ కుక్కి మంచాల నుంచి దిగ్గునలేసింది... నాత్రంత ఏడ్సేడ్సి సెంపల నిండా కారినకన్నీల్లను కొంగుతోని తుడుసుకున్నది. మనుసు మొద్దుబారిపోయింది. కండ్లు నిదురలేక ఉబ్బిమండుతన్నయ్.

పనుగడి తీసుకొని గుడిసె బయటికి నడిసింది. అంపుల కాడికి నడిసి మొఖం మీన నీల్లు జల్లుకొని, నోట్లెన్ని పోసుకొని పుక్కిలించి ఊంచింది. తల గోల్ల కొట్టుకొని సిగ ముడుసుకున్నది.

బజాట్ల బర్ల కొముర య్య నిలుసుండి కీకేసిండు...

"బర్లెల్లి పోతన్నయ్... ఇడువుంద్రే..."

గొంగడి భుజానేసుకొని కుంటుకుంటెల్లి పోతండు...

ఎంకమ్మ బర్రె పెయ్య నిడిసింది...

"తీగెలు సాగుతన్నయ్. రేపోమాపో ఈనెటట్టున్నది" అనుకొని...

"ఓ కొమురన్న—జరంత బర్రెపెయ్యను కాపెట్టుకుంటుండు... ఈనెటట్టుగున్నది. మాయితింటే పొదుగెండుక పోద్ది..." కీకేసి చెప్పింది...

"బిడ్డా! రెండు రూపాలు తయిసతుగుంచు - కల్లు దాగాలె..." బర్ల కొమురయ్య...

బర్రె పెయ్యను ఆకిలి దాటిచ్చి—అకిట్ల పెండకడి పెంట మీన పారేసి... సేతులు కడుక్కొని మొక్కిసీపురందుకున్నది.

"దేవుని గుల్లె రాయివడ బట్టు రాత రాసిండు. పుట్టుడే జెష్ట పుటుక బుట్టింది. పుడితినే తల్లిని అంపిన...అయ్యసచ్చి ఏ లోకంలున్నడో- తల్లి తండ్రి తనే అయి పెంచిండు..."నిన్ను పసిగుడ్డును నాసేతుల్ల బెట్టి మీయవ్వ అదురుట్టవంతురాలు.నీకట్ట సుకం సూడ కుంటనే ఎల్లిపోయింది ... గివ్వార్దనుక సాది సవరచ్చెన జేసి ఇంకో అయ్య సేతుల బెడ్తన్న. బుద్ధిగలిగుండు ఎంకవ తల్లీ——" అని పెండ్లి జేసిండు. సుఖంగ బతుకుతన్ననని అనికండ్లు మండినయ్. అని నాముసరుక అని పిట్టకు బెట్ట-అని దుట్టితనం గీ భూమిల బోను ఆడు లావు సెల్లిచ్చుకుంటండు. ఊళ్లె ఎదిగిన అడిపోరుండ భయం-ఉసికుక్కమసి కుక్కుంటడు.... నా బతుకును నట్టేట గలిపినప్పుడు ముసలోడు మాట పలుకు బందుసేసి ఎర్రిసూపులు సూసిండు. ఊరు కోడై కూసెటాల్లకు ముసలోని పాణం అవిసిపోయింది. ఇంకెంత కాలం నా ఉసురు బోసుకుంటడో? నా ఉసురు దాకి పిలువ పిల్లలేకుంట మే అన మేక లేకుంట నాశిడగాలమైపోను..." ఎంకమ్మ ఎనుకటి బతుకును తలపోసుకుంటంది...

పొద్దెక్కి పోతంది...

"తెగిన బొక్కెన నూతిల దనుక-ఆగుల అరదకు కొట్టుకచ్చిన కొయ్య ఏ ఒడ్డుకు తట్టుకుంటదో? ఏ ఉసికె కింద కప్పుక పోద్దో? ఏ సెరువుల తేలుద్దో? ఎంతదనుక ఉరుకుతదో? ఎవల కెరుక?" అనుకొని సమధానపడ్డది...

సరిగ్గ బువ్వదినే ఏల్లకు ఎంకమ్మ అకిట్ల అడుగుల సప్పుడయినాంది... ఈతల కెల్లి సూత్తె పేవున్నది... సుంకరోడు నిలుసున్నడు...

"ఎంకవ్వా!" సుంకరి రాయనర్సయ్య ఏందో సెప్పబోయిండు.

గేరచ్చి పడిపోతదన్నట్టుగ పసుగడి కానుకొని, ఎంకమ్మ సుంకరి రాయ నర్సయ్య పెరిగిన గడ్డాన్ని– పీక్కపోయిన సెంపలను... అంగిపోయిన మీసాలను సూసుకుంట నిలుసున్నది...

సుంకరి రాయనర్సయ్య సెప్పాల్సినదేందో సెప్పిండు ... గిరుక్కన ఎనుకకు తిరిగి బరిసె నూపుకుంట బజాట్లకురికిండు...

ఎగగట్టిన సినిగిన ధోతి తప్ప పెయ్యిమీన ఇంకేమి లేని సుంకరి రాయ నర్సయ్య కనుమరుగయ్యేదనుక సూసుకుంట నిలుసుండి పోయింది ... కండ్లు నిలబడిపోయినయ్... మనుసు నిలబడిపోయింది...

"ఏందే ఎంకీ! గలుమల నిలుసుండి కట్టెసరుసుక పోయినవ్... మళ్లేం ముంచుకచ్చిందే? సుంకరోడెందుకనో అచ్చిపోతండు?..." ఆకిట్ల నిలుసుండి ఎంకమ్మకు పెద్దవ్వ వరుస మసలవ్వ అడిగింది...

"ఏంలేదు పెద్దవ్వా? ఏంలేదు?..." గిరుక్కన ఎనుకకు దిరిగి కుక్క మంచాల కూలిపోయి ఎక్కెక్కిపడి ఏడ్సింది...

ముసలవ్వ గుడిసెనిట్టాడుకాడ కూలబడిపోయి అంతుపొంతు లేకుంట ఎవలనో తిట్టింది. కడుపుల దుఃఖం కరిగిపోయే దనుక ఎంకమ్మను ఏడువ నిచ్చి....

"అసలు సంగతేందే ఎంకవ్వ...." అన్నది ముసలవ్వ

ఏడ్సుకుంట–కొంత కొంత సెప్పింది ఎంకమ్మ

"ఆనింట్ల పీన్గెల్ల ఆడు లావు సెల్లిచ్చుకుంటండు. సెడిసెల్లిచ్చు కున్నో ల్లంత సెర్లకేపోతరు గోస తలిగి.... ఏడ్వకు బిడ్డ ఏడ్వకు...." అని బొచ్చె కానిచ్చుకొని ఊకుంచింది.

* * *

## 5

పారెత్తి లగాంచి భూమిల దించిండు నర్సింహం ....పెరడి ఆవలిగెట్టు మీన్నుంచి ఎవలో పిలుత్తన్నట్టనిపిచ్చింది.... గాలికి కర్రలూగుతంటే సప్పు డత్తందికావచ్చుననుకొని పారతోని మన్నుదీసి ఒడ్డుమీన పోసిండు. ఈ పారి మల్ల పిలుపినచ్చింది.... కొంచెందగ్గరనే ....

అంచిన నడుమెత్తి నొసలు సెమట తుడుసుకొని "ఓయ్" కేకేసిండు.

గుడిసేపటికి గాలికి "బొయ్యిన" రొదపెడ్తన్న మక్కకర్రల పాపుకుంట సుంకరి రాయనర్సయ్య అటుకెల్లచ్చి దట్టమీన నిలుసున్నడు.

"పెద్దొర జరూరుగ రమ్మన్నడు..."

పెద్దొర పేరినంగనే నర్సింహకు సర్రున కోపమచ్చింది.

"పెద్దొరెవర్రా?.... పెద్దొర...."

"పెద్దొరెవలో ఆడిదాక త్తె తెలుత్తది...."

"ఏందిరో.... నువ్వే దొరయినట్టుగ నీల్గుతన్నవ్ "

"నీల్గుడు నిక్కుడు నాకెర్కలే"....దొరజెప్పనతోలుక రమ్మన్నడు....

"ఏం ముంచు కచ్చిందట...."?

" "

"నాకెమెరుక ....దొరింటికాడ నలుగురు కూకున్నరు...."

"అగ్గోమల్ల రావేమయ్యో ! రా రా! ఆలిస్యమైతే నాకు నాల్గుతిట్లు దాకు తయ్...." సుంకరోడు అరిసిండు.

నర్సింహం నిదానంగ సుంకరోని మొఖం సూసిండు...."మొన్నటిది మొన్ననే అయిపాయే-కంభాలు, తీగ పీక్కున్నది దొరేనాయే—మళ్ళ పంచాయతి ఎవల మీదనో? నలుగురెందుకు జమైనట్టు " మనుసుల అనుకొని ఎటు తోసక నిలుసున్నోడు నిలుసుండే పత్తాయించిండు-

"ఏందయ్యో! దిక్కులు సూత్తన్నవ్ అడ అల్లంత కూకుండి నీకోసం ఎదురు సూత్తండ్రంటే సమజయితలేదా? జరూరుగ నడు నడవయ్యా!"

పారను పెరట్లదాసి—సుంకరి రాయ-నర్సయ్యెంట ఊళ్లెకు నడిసిండు " తొవ్వల "సంగతేందని?" అడిగిండు. రాయనర్సయ్య సూటిగ నర్సింహం మొఖం చూసి ఏందో సెప్పాల్నని నోరు తెరిసి ఏం సెప్పకుంటనే ముంగటికి నడిసి "సుంకరోల్లకేం తెలుత్తయి.ఎవారాలు తోలుకరమ్మంటే తోలుకచ్చి అప్పజెప్పుడే నాపని " అన్నడు.

నర్సింహంకు గిదంతేందో మాయ తీర్గున్నది

నర్సింహం గడిల అడుగు పెడ్తంటనే పెయ్యి జడితిచ్చింది.

పెద్దరువాజ కాడ ఎంకమ్మ తలుపు కతుక్కపోయి ఆనమబొమ్మోలె నిలుసున్నది

ఆకిట్ల అడుగు పెట్టెటాల్లకు ఊరి పెద్దమనుషులంతా గద్ద సూపులు సూసుకుంట కనిపిచ్చిండ్రు. బుగ్గ మీసాలోల్లు, బట్టతలలోల్లు, తలలు నర్సినోల్లు, తలపులు నరిసినోల్లు, నాగుంబాముసూపులోల్లు, నక్కజిత్తుల మారోల్లు, బొత్త కడుపులోల్లు, కులాల వారిగ, అళ్లతున్న కోండ్రల వారిగ సింతసెట్టుకింద కూకున్నరు.

గట్ల సబ్బండ పర్నాలు కొలువు దీరికూకున్న సింత మొదట్లకు తనుసుత నడిసింది.

అండ్లోల్లు కొందరు నర్సింహను సూసి పలకరింపుగా నవ్విండ్రు మరి కొందరు గేలిసేసుకుంట నవ్విండ్రు....

తప్పేందో? ఎవలదో? పంచాతేందో ఎవలకు అంతు సిక్కుతలేదు నలిపిడుగో? ఉడుకు పిడుగో? ఎవని మీన పడతదో? ఎవలకు తోస్తలేదు... "రమ్మంటే" అచ్చిండ్రు "కూకోండ్రంటె" కూకున్నరు...ఇనుమంటే ఇంటరు? "తప్పాగిదేనంటే" గదే "గదే బాంచెనని" తలలూపుతరు. లేసి పోండ్రంటె లేసిపోతరు...

ఎన్నేండ్ల బట్టో గిట్ల ఎల్లిపోతున్న ఎవారాలకు అందరు కూడుతనే ఉన్నరు....ఎవనికొంపో కూలిపోంగ సూత్తనే ఉన్నరు మారుమాట్లాడకుంట దొర సెప్పిన మాటల సిరసు కెత్తుకొని ఎల్లిపోతనే ఉన్నరు....

గిప్పుడుసుత పంచాతు అంతుబట్టక పడేపిడుగు ఎవని మీన పడ్తదోనని ఎవలకాల్లే బేజారయిపోయి ఆదుర్దగ పులి తోలుకుర్సి కెల్లి సూసుకుంట అల్లండ్లాల్లే మల్ల గుల్లాల పడ్తండ్రు–గుసగుసలాడు తండ్రు...

అందరి సూపుల సేదిచ్చుకొని, లోగింట్ల పరద తొలిగిచ్చుకొని మొదుగాలు సికిలేటుపొగ అటెన్కదొర అరుగు మీని కచ్చిండు... సికలేటు సెప్పు కాలుకిందేసి నలిసి కుర్సిల కూకున్నడు.

సుంకరోల్లిద్దరు అంగంగి సలాములు సేసిండ్రు–దొర మారుదండం బెట్టకుంటనే కూకున్న ఊరిపెద్దలను పార సూసిండు. ఆల్లలేసి నిలుసుండి అందరొక్కపారే "దండం" సెప్పిండ్రు– అళ్ళకు సుత మారుదండం పెట్టకుంటనే మరోదిక్కు సూసిండు.

"పెద్దపులికి ముంగటిసూపె గని ఎనక సూపుండదని" సుంకరోల్లిద్దరు గుసగుసలాడిండ్రు.

ఏడినుంచో టక్కున ఊడిపడ్డట్టుగ మాలిపటేల్ ముకుందరెడ్డి ఉరుకుతచ్చి దొరకు ఒంటిసెయి దండం బెట్టిండు.

"ఊరంతటికి తెల్లారిన నీకు నడిఝాము నాత్రి తీర్గనే ఉంటది..." ముకుందరెడ్డిని సురసుర సూసిదొర...

"అన్నా! కన్ను నామీన్నే పడ్డది పొద్గాల..." మనుసులనుకొని

"అగ్గెఝాము పొలంకెల్లి పోయిన్నండ్రి....ఇగో ఇట్ల ఇంట్ల కాలు బెట్టెటాల్లకే....తమరు కేకేసిండ్రని తెలిసింది....ఏదీ– అదే కాల్లతోని ఉరుకుత రానే పడ్తి." నని అరుగెక్కి కుర్సీల పక్కకున్న బెంచీమీన కూలబడి పోయిండు.

గంతట్లకే పట్వారి గౌరయ్య, కోమటి రామలింగం ఒకలబట్టకొకలు ఉరికచ్చిండ్రు... దండంసెప్పి ముకుందరెడ్డి పక్కకు కూకున్నరు...

"కోమటాయినెకంటె తెల్లారిలేత్తెనే గల్లపెట్టె సదురుడాయె— అయినె కంటె తీరికబల్లే! మల్ల నువ్వేం జేసినవ్ గౌరయ్యా! నోట్లు ఏంచుడయిత లేదా?"

"నోట్లెక్కడ యుండ్రి...రద్దుకాయిదాలు తప్ప..."...

"దొర వారెప్పుడు నాగల్లపెట్టెమీన్నే పరాసికమాడుతరు. పెద్దోరిసూపు బడ్డదంటె మాడుతదుండ్రి..." షావుకారి రామలింగం బొత్తకదులంగ నవ్విండు, పదారుపండ్లు ఎల్లబెట్టి...

దొర సికిలేటు ముట్టిచ్చిండు... మల్ల అందరిని ఓ పారి సూసిండు ... తలంచుకొని నిలుసున్న ఎంకమ్మను సూసి తలూపిండు. సింతసెట్టు మొదట్ల సింతతోని సిన్నబోయిన మొఖంతోటి గద్దున కుడిసేతి కానిచ్చుకొని తనకెల్లి రెప్పార్పకుంట సూత్తన్న నర్సింహంను సూసి మొఖం సిట్లిచ్చిండు.

దొర సప్పుడు సేయకుంటే- అందరు సీమ సిటుక్కుమన్న ఇనిపిచ్చే టంత సప్పుడు సెయ్యకుంట మూగ మొద్దులోలె కూకున్నరు...

సింతమీన కాకెందుకనో తెగఅరుత్తంది...గడి ఆవల బజాట్లబండి ఉరుకు తన్న సప్పుడు... కచ్చులం బల్లలు ఎగిరిన సప్పుడు అంతకంతకు దూరమై పోతంది...

దొర మొఖంల ఇసారాలు సుల్లు తిరిగినయ్ ... సికిలేటు అరుక్కింద పారేసి సరాంచి ఊంచిండు...గప్పుడు నోరిప్పిండు...

"జమాన బదులాంచి పోతంది... మనుషులు నీతి దప్పిపోతండ్రు... లాపరువ ఎక్కువై పోతంది...జనాలకు వాయివరుసలులేకుంటయిపోతంది. బొత్తి లకు బరితెగిచ్చి పోతండ్రు...పురుగు బుట్ట దిని పుట్టలుండక...మనుసుకెంత దోత్తె అంతే సేత్తండ్రు...కండ్లు తెరిత్తే గజగజ అనికిపోవాలె...మక్కగడ్క దిని మదమెక్కింది బంచత్. ఊరు అంతకంతకు కట్టడి తప్పిపోతంది...మొల్ దారం సరిగ్గ లేనోడల్ల మొగోడయిపోతండు...లంజకొడుకులు అదెపాయె పోనియ్యి అని సూసి సూడనట్టు ఖాతరు చెయ్యకుంట ఇడిసి పెత్తంటె- రోజుకో ఏషమేసి ఎగురుతండ్రు. నాఅంతటోడులేదని నీల్గుతండ్రు. ఈడుమీనున్న ఆడి దాన్ని సూత్తె కండ్లమీనికి మైకం కమ్ము కత్తది...ఈడు మీదున్నోడు. ఇంట్ల పెండ్లం లేనోడంటె ఏదో మొగబుద్ది...లంజకొడుక్కు ఏఖాల్లి దొర్రిందో నను కోవచ్చు...నీతల్లి ముసలి ముండకొడుక్కు ముండలసోకా?" దొర ఆగి అందరి కెల్లి సూసిండు.

అంతదనుక ఆడ కూకున్నోల్లందరికెరికే...అందుకు సాచ్చెంగ తలుపు కతుక్కపోయిన ఎంకమ్మ అందరికి కన్పిత్తనే ఉన్నది. కాని...గ ముసలో డెవడో ఆళ్ళకిప్పటికి ఎరుకగాలేదు.

నర్సింహం దొర మాటలు ఇంటనే ఉన్నడు. గడిని, దొరను సూసుకుంట కూకున్నడు...తను గీ గడిలుండంగ గిసొంటి పంచాతులు తలెంటికలన్ని సూసిండు.

దొర మొఖంలకు నెత్తురు సిమ్మకచ్చింది కండ్లు కమ్మని కొలిమోలె మండుతన్నయ్...హోరు పెట్టకుంట ఆలిని, అక్కను, అవ్వను మునుంబెట్టి తిట్టిండు....తిట్టుకుంటనే పండ్లు పటపట గొరికిండు...తిట్టుడు...సెప్పుడు అయి పోయినంక మల్ల అందరికెల్లి సూసిండు....

"ఎంకీ...." అని పిలిసిండు ఉరిమినట్టుగ....

ఎంకమ్మ సప్పుడు సెయ్యలే.

"ఎంకిలంజె మన్నుదిన్న మంజేరు గున్నోలె సప్పుడు సేయవేందే? నీ కాలు సెప్పతీయ్....తీయవే- తీసి నలుగురు సూడంగ నర్సిమ్మ ని మొఖంమీద తుడువ్....ఏడగుంజిండే?"

ఆడ కూకున్నోల్లు మారు మాట్లాడకుంట కూకున్న నర్సింహంకెల్లి సూసిండ్రు....

"గీ ఈడులేం బొయ్యేకాలం?"

"ఏఘడిఎట్లత్తదో ఎవడు సెప్పచ్చిండు?"

"మారే గోరెడు మాంసంలేనోనికి గ బుద్దులా?"

"గిండ్లేమన్న?"....

"ధుఁత్తెరి దొర సూ త్తండు సప్పుడుసేయకుండ్రి"

"బట్టకాల్సి మీదేత్తే ....గిదేం అన్నాయెం?"

"సయిసు ....ఇనరాదు."....

గిట్ల గుసగుసలు పెట్టుకున్నరు. ఎవరో కొంచెం దూరంగకూసున్నోడు గట్టిగనే గులుగుతండు

"ఎంకికి మానం బెట్టలే దేవుడు ఎవన్ని బడిత అన్నె బదునాం సేత్తంది. ఓ పడుసోడు బట్టోడంటే సమ్మచ్చు. అవద్దమాడిన అతికినట్టుండాలె" ఆ మాట లెవడు ఇనలేదు. ఇన్నా ఎవడు పట్టించునునేటట్టులేదు.

సుంకరి రామనర్సయ్య "సయిసుండ్రిం సయిసుండ్రని" సేతులూపి కొంచం ముంగటికి జరిగి నోరుపెద్దగబెట్టి "పొల కాన్నట బాంచెన్" అన్నడు.

ఆ సంగతిన్నదొర కుర్సిలనుంచి అధాటుగ లేసిండు" గ లంజకొడుకును ఈడ్సుకరాండ్రి...." అని సుంకరోల్లకెల్లి సూసిండు

సుంకరోల్లిద్దరు నర్సింహం జబ్బలుబట్టి గొరగొర ఈడ్సుకచ్చి దొర ముంగట పట్టుకొని నిలుసున్నరు.

దొర కాలుసెప్పు ఊడబీకిండు. ఝాడిచ్చి దవుడమీన గొట్టిండు నర్సింహం సెంప సితికిపోయింది. నోట్లెనుంచి నెత్తురు కారింది. దొర దెబ్బమీన దెబ్బ కొడ్తనేఉన్నడు... నర్సింహం దెబ్బదెబ్బకు సెయ్యడ్డం పెట్టిండుగని సెయ్యి అతన్ని ఆదుకోలేదు....దొర యాస్టకచ్చేదనుక కొట్టి కొట్టి సెప్పు కింద్ల పారేసిండు. తుపుక్కున అరుక్కింద ఊంచి కుర్సిల బోయి కూకున్నడు.

ఎంకమ్మ మనుసు సుమ్మర్లు సుట్టుకపోతంది....దెబ్బదెబ్బ తన ఒంటి మీన్నే పడ్తన్నట్టుగ అన్పిచ్చింది ఎటూ సాతకాక పులపుల కండ్లపొన్న నీల్లు కార్సింది.

"దొంగలంజకొడుకా! గులాపులంజకొడుకా! అద్దదుపు లేకుంటున్నవ బంచత్.....దానికెవలు దిక్కు దీము లేరనుకున్నవ.....ఇది ఊరనుకున్నవా? పాడనుకున్నవా? పొలంల గడ్డికోసుకుంటంటే ఒడ్డుకిందికిగ్గి ఖరాబుసేత్తవ?" అని పెద్దమనుషులకెల్లిదిర్గి....గిసొంటోల్లకు దెబ్బలతోని బుద్ధిరాదు.....గచేటు బొయి తుడిసేసుకుంటరు....ఏమంటరు....?"

"ఔనుండ్రి....లంజకొడుకులకు పెయిల బయంలేకుంటయిపోయింది. పూరగా బరి తెగిచ్చిపోతండ్రు- దొరధాత ఖదరు లేకుంటయిపోయింది.... మల్ల మాట్లాడితే....మల్లమాట్లాడితె...." ముకుందరెడ్డి పండ్లుకొరికిండు....

"దండు గెయ్యిండ్రి...."పట్వారిగారయ్య సలాసెప్పిండు....

"ఔన్రర ఏమంటరు. మీకందరికీ సమ్మతమేనా?" కోమటి రాములింగం అందరి నడిగిండు....

"దండుగ లేకుంట పంచాతెట్ల తెగుద్దుండ్రి? పూనోటిమీనికెల్లి సెప్పి త్తండ్రు...." ఎవడో గుంపులనుంచి అన్నడు.

"పంచాతంటెనే బొంద బెట్టుడుగదా! మీనికెల్లి నడువరాదుండ్రి" ఎవడో ముసలోడు అని ఎనుకనుంచి ఎనుకకే పెద్దరువాజ దాటిపోయిండు....

"ఐదునూర్లు దండుగ్గట్టాలె....లేకుంటే పోలీసుల కప్పజెప్పుత" అన్నడు దొర.

"దడావతు లేకుండ పంచాతులు సేత్తే గిదే ఏడుపు" పట్వారి గౌరయ్య మెల్లెంగన్నడు....

"మారే దడావతు లేకుండ పంచాతులెన్నడుగావు. ..మనం పుట్టి బుద్దెరిగిన కాన్నుంచి గాలే.... గిది ఎవలకు దెలువకుంట మిడివిత్తినట్టయ్యింది గద గిండ్ల దొరెందుకనో అగ్గిలబడ్తండు.... ఏందో ఉన్నది పీకులాట—" కంభాల రామలింగం గౌరయ్య సెవుల గుసగుసలాడిండు

"ఊకుండు—అద్దంతీర్గ కన్పడ్తనేఉండే." గౌరయ్య....

నర్సింహం గింతయినంక సుత మాట్లాడలేదు.

ముకుందరెడ్డి మొఖమంత యెర్రగసేసుకొని నర్సింహం మీనికురికిండు. గౌరయ్య కాలం సెడిపోయినందుకు నరాలు తేలినసేత నొసలు గొట్టుకున్నడు. రామలింగం బొంగురు గొంతికతోని బండబూతులు దిట్టిండు. షెకెదారు బాలమల్లు ఎప్పుడచ్చిండోగని సెట్టెత్తెగిరిండు

తిట్టెటోల్లు తిట్టింద్రు.... దొరమేర్బానికోసం కొందరు తిట్టింద్రు మొఖం మాడ్సుకునోల్లు మాడ్సుకున్నరు.

కని అంతమందిల గీపని నర్సింహం సెయ్యలేదని.... బొక్కలెల్లిన అతని శరీరం "మస్తి"లేదని ఒక్కడంటే ఒక్కడు సుత అనలేక పోయిండు

ప్రతాపరెడ్డిదొర ఎవలుసెప్పేది ఇనకుంటనే అనేటియి తనే అని తీర్పు సెప్పిండు....గ దానికి తిరుగులేదు సల్లుబిగిలేదు .... గండ్లనాయమున్న దొర తప్పన్నడుగన్క గది తప్పే....

నర్సింహం అంతవరదనుక కాకులోలె కుక్కలోలె అరుత్తన్న అందరి మాటలను దొర సెప్పుదెబ్బలతీర్గనే సయించిండు.... పల్లెత్తు మాటసుత అనలే.... గీ కొత్త అపనింద దేనితోనచ్చిందో? గీదెబ్బలు దొరెందుకు గొట్టిండో? నర్సింహంకు ఎరికే; కొట్టినదొరకెరికె కాని మూడోమనిషి ఎంకమ్మకు గీ అయి మూల లెరికలే.

నేంజెయ్యవట్టే గిన్నిదెబ్బలు దిన్నడనుకునే టాల్లకు ఎంకమ్మకు....అరద తీర్గ దు:ఖం పొంగత్తంది ఎందుకనోమీనికి ఏడ్వక బెక్కుతంది....సూసినోల్లంత ఎంకమ్మ ఏడ్పును ఇంకోతీర్గ సమజ్ సేసుకొని నర్సింహంను కోపంగా సూత్తంద్రు.

అందరి తిట్లు దీవెనలు అయిపోయినంక నర్సింహం అంచిన తలెత్తి నీల్లు నిండిన కండ్లతో అందరిని సూసిండు. పెదవు కొరుక్కున్నడు...మల్లింక అందరి ముఖాలు సూల్లేనట్టు మొఖం రుద్దుకున్నడు....మనుసుల మంటలులేత్తన్నయ్.... కోపం బుసలు కొడ్తంది....ఏందో సెప్పబోయిండు. గొంతిక జీరబోయింది .... ఎందుకనో పూట తడబడ్తంది.... సగంజీర-సగం తడబడే మాటలతోటి...

"అయ్యల్లాలా! మీకాల్ మొక్కుత ధరమ దొరలు గింతమంది గీడ మబ్బులేని అస తీర్గ జరూరుగ జమైపోయి నిలుసునోల్నిన్ని నిలుసున్నట్టుగనే పట్టి తెప్పిచ్చి....తిట్టేకాడికి తిట్టి....మీ సేతులు నొచ్చేదనుకకొట్టి తీరుపుసెప్పింద్రు-

జివసత్వాలుడిగి-కడుపుకు కంకెడు గడ్క లేక దిన దిన గండంలా బతుకుడే సావుకన్న రోతగ బతుకుతన్న నా అసొంటోనికి మద మచ్చిందా? సెరువుకింద గోరెడు భూమిలేనోన్ని జాడపట్టుక పోయి పొలంకాడ. ఖరాబుసేసేంత కావుర మచ్చిందా? సిన్నప్పటినుంచి మీకండ్ల ముంగట్నే పెరిగిన పొట్ట గంజోన్ని.... గసొంటి బుద్ధి ఎప్పుడన్న సూసిండ్రా?ఇన్నరా? పరుసు దనంల ఫలాని నర్సిమ్మడు గసొంటోడు గిసంటోడు అని ఎప్పుడన్న ఇన్నరా? గీనడీతుల పదేండ్ల బిడ్డను బెట్టుకొని పరాయి ఆడదాన్ని ఇగ్గి ఖరాబుసేసిన్నని ఖరాఖండిగ తీరుపుసెప్పింద్రు— నర్సింహం గొంతిక మాటలురాక పూడుక పోయింది—

"దొంగ లంజకొడుక....నీ నాలెషుచ్చుపెం....ముసలీడువు లేడు త్తన్నవ్ ఏమే ఎంకీ గీలంజకొడుకు నిన్నిగ్గలే?" దొర గద్దరాంచి ఎంకమ్మకెల్లి పిల్లి సూపులు సూసిండు....

ఎంకమ్మ కోడిపెట్టోలె గజ గజ వణికి పోయింది—ఎటూతోసక దొర ఎఱ్ఱెకండ్లను సూసి తలూపింది.

నర్సింహం నాలిక కొరుక్కుని ఎంకమ్మ కెల్లి దిరిగిండు.

"అవునె ఎంకవ్వ...."

అక్కడ కూకున్నోల్ల మొఖాలల్ల "ఔను" "కాదు" "ఔనోకాదో?" సూసి దొర గాబర పడ్డడు.

"అన్ని సింతకు ఇర్సికట్టేయిర రాయసర్స-నకురాలు సేసుకుంట నల్లికుట్ల ఏడుపులేడుత్తండు....."

నర్సింహంలు కండ్లు ఎరుపెక్కినయ్.... మొఖం కందగడ్డయ్యింది.

"కట్టేత్తరు. దొరా! సింతకు గాదు సిరుసు దరువాజకే కట్టేత్తరు. మల్లమాట్లాడ్తె తోలు పికులగొడ్తరు.... ఎందుగ్గొట్టరు? తమరిని నాపెరట్ల కంభాలు పీకింద్రని అడిగిన గద?....దానికిది మందు.... నలుగుట్ల సెప్పుతోటి గొట్టి మీదికెల్లి లంజెతసం మోపింద్రు. సచ్చినట్టుపడెటోడుంటె సచ్చేదనుక కొట్టి కోలాటమే త్తరు.... మీకు ఎదురేమున్నది....? అడ్డు ఎవలున్నరు?... సెల్లెఎంకవ్వ! నువు గంగెద్దోలె తలూపినవంటె నీది తప్పుగాదు.... మన లాడిచ్చెటోల్లది.... మనండ్ల మనమే లంజలం - దొంగలం.... గందుకనే మనల నడిమందిల ఇసారిచ్చి పంచాతుసెప్పుతరు. మనంతం కండ్ల జూడాలంటె మనలంగదీయాల్నంటె నూటొక్క తప్పులు మనకు తయిసత్ గుంటయ్....మనమే దొంగలైపోతమ్.... మనమే సాచ్చాలు సెప్పుకోవాలె...." నర్సింహం కంఠం అంత కంతకూ ఎక్కువైతంది...

సుంకరి రాయనర్సయ్య "ఎటూ తేల్చుకోక" కుడిదిలబడ్డ ఎలుక తీర్గ అయిపోయిండు. . .

ఆడ కూకునోళ్లంత గాలి బిగపట్టి "ఏం జరుగనున్నదో? నర్సింహంకు అంతెగాలం దగ్గరికొచ్చిందోనని" భయపడ్డరు.

"దొరా? నన్నురిసి కట్టేపిచ్చి నా నోరు మూపిచ్చి బండలెత్తిచ్చి, బరిగెల తోని గొట్టి సెయ్యని నేరాలు ఒప్పిత్తరు... నన్నొక్కనేగాదు. తమరు తలుసు కుంటె ఈడ కూకునోళ్లెవలనైన గట్లసేత్తరు. గీఊరు బుట్టిన కాన్నుంచి నా తలెంటికలన్ని సూసిన.... గీడ కూసునోళ్లంత సూసి సూసి కండ్లు మూతలు బడ్డోళ్లె.... మేమంత మీ సెప్పుల కింద సీమలోలె బతుకు తన్నమ్. . . అను కుంటాంండ్రుసిచ్చమే. మా జుట్టు పోసలు ఇరుకబట్టి తోలుబొమ్మ లాడిచ్చినట్టుగ ఆడిత్తండ్రు. అప్పులు, అడ్డీలు, పెచ్చులు గట్టి మా నోర్లకు తియ్యరాని తాళా లేసింండ్రు....ఇగో....నేను తమరి ఉప్పు పప్పు సిన్నప్పుడెప్పుడో తినచ్చు. కని గిప్పుడు తమరికి నాకు ఏ బీరకాయపీసు అతుకులేదు. తమరి అంటంటినా? సోటంటినా? గీ ఊరికి దొరవుగావచ్చు.... ఏలెకురాల మాలుకు దారువు గావచ్చు....మంది పేరట్ల కంబాలు అద్దుమనాత్రి పీకిచ్చి-గిదేందంటే సెప్పుతో గొట్టటం దొరతనం కాదు...నీ కాడ అయిదు గొంటబొయి మొఖం సాటేసుకోలె-పది గొంటబొయి ఎగబెట్టలే-ఇరువై ఏండ్ల కింద తొక్కిన గీ గడితొవ్వ మల్ల మొన్న తొక్కిన....నాకట్టం నేనే తింటన్న...." నర్సింహం పెదపోశమ్మ పూని నట్టుగ ఊగిపోతండు....సరసర ఊరి పెద్దోల్ల కెల్లినడిసిండు....

"ఊళ్లెపెద్దలు ....పీతిరిగద్దలు .... నామొఖం మీన ఏవున్నదిర్రా.... భాగోతం...దెబ్బలుగొట్టి అనుగదియ్యలేరుర్రా....అయిదునూర్లుగాదు. అయిదు పైసలు సుతగట్ట....ఏమన్న జేయిండ్రి",

కొత్త శకితేందో పూనినోనితీర్గ....ఇంతకు ముందు ఎవలు సూడని కొత్త మనిషి తీర్గ సరసర పెద్దరువాజ దాటి నర్సింహం ఎల్లిపోయిండు....ఆడ కూసు నోళ్లంత భీరిపొయ్యి బిగుసుక పోయింండ్రు....

గఊల్లె సాటు మాటుకు ఎవడన్నగిట్ల తెగిచ్చిండో-తెగియ్యలేదోగని-గంత మంది ముంగట...."దొరకెదురు మాట్లాడి ఎల్లిపోయినోనెవన్ని సూల్లేదని" తలలు నెరిసినోల్లు గుసగుసలాడింండ్రు.

సుంకరోలిద్దరు అందరి తీర్గనే భీరిపొయ్యి కొయ్యలతీర్గ నిలుసుండి పోయింండ్రు...

ప్రతాపరెడ్డి దొరకు సుత గిదంతేందో ఉల్టా అయిపోయినట్టుగ- గొడ్లల్ల ఒక్కకోల్లాగే సత్తదనుకున్నది- లెంకేసి పొడిసినట్టుగ ఎటూతోసక...సికిలేటు అంటుబెట్టుకున్నడు... గప్పుడు...

"సూత్తరేంర సుంకరి లంజకొడుకుల్లాల... ఆనవ్వాసు కుక్కల్‌దెం... పండ్లురాలగొట్టక..."

సుంకరోల్లు ఉలికిపడి ఉరకబోయిండ్రు. అప్పటికే నర్సింహం బజాట్ల కెల్లిపోయిండు...

దొర బొండిగ ఎవలో పిసికి మాటెల్లకుంట సేసినట్టుగ... సూసిండు—"వారీ! సుంకరోల్లు ఇగరాండ్రి... ఏడబోతడు... కోడిపుంజు పిత్తబలిసి మునిమాపు గుడిసెక్కి గూసిందట- నక్కబలిసినాక బిస్ అన్నదట-పెట్లెగిరి సచ్చింది...ఆనిగొనె కాల్లిరగొగట్టియ్యకుంచే..." దొర అట్టట్టిగానే నవ్విండు... "అడెంత ఆని బిసాదెంత" అని అందరికి సమఝుకావాల్నని...

"మారే! గంతెగురుడెగిరినోన్ని ఇడిసిపెడితే ఖదరే ముంటది" ముకుంద రెడ్డి—

గౌరయ్య సింతసెట్టుమీదికి గుడ్లుతేలేసి సూసి పొవాకుసుట్ట జేబుల్నుంచి ఈవలకు తీసి గట్ల సూసుకుంటనే మల్ల జేబులేసుకున్నడు...

దొర అథాతుగ లేసి ఇంట్లకు బోయిండు...

ఊరోల్లు- ఏమనుకునేటందుకూ్కడ బుగులుపడి ఎవల దారిన ఆల్లే లేసి పోయిండ్రు...

నడినెత్తిమీన సూరీడు మండుతండు...

(ఇంకా వున్నది)

---

రెండు అగ్రరాజ్యాల ఆటలో ఉపయోగించే నాణెం అయింది దేశం. నాణెం మనదేకాని రెండువైపులా విలువలు మనవికావు.

వై. శ్రీరాములు

వంగపండు ప్రసాదరావు పాటలు :

# నడుం కట్టు

డప్పు పాట

నబో నబో నకజనకరి
నడుము గట్టరా
కడుపుమండె కూలోడా
పిడికి లెత్తరా ॥నబో॥

ఆకలి పేగులు తీసీ
ఆయుధాలుగా జేసీ
ఎండిన గొంతుక తీసీ
విప్లవ శంఖము జేసీ
ఆకాశం భూలోకం
అదర గొట్టరా
ఆశలగొండా రాయిమీదా
పదును పట్టరా ॥నబో॥

కరిగిన కండలు దీసీ
కత్తులు గొడ్లుజేసీ
ఇంకిన నెత్తురు తీసీ
యుద్ధ భూమికే రాసీ
వుద్యమాల దారిలోను
వురికి గెంతరా
వురికొయ్యలు పట్టుకోని
వురక లెయ్యరా ॥నబో॥

మండుతున్న మనసుదీసి
మంటలుగా రాజేసీ
ఎండుతున్న ఎముకలన్ని
నిప్పులుగా కాల్చేసీ
ఆ తూరుపున్న సూర్యుడులా దూరిలేవతా
ఆ తూరుపు కొండలమీద
జేగురించరా ॥నబో॥

తిండిలేని బాదతీసి
కొండంతా బలముజేసి
ఆ కలల్ల అడవి జేసి
అందులోను మాటేసి
ఎర్రపువ్వుకత సెపితే
ఆలకించరా
ఆలకించి ఆలకించి
అదును జూడరా ॥నబో॥

నలుగుతున్న నరాలన్నీ
అలగిలగా వలపన్నీ
కళ్ళురెండు నిలబెట్టీ
అదునుబాగా కనిపెట్టీ
పెద్దచేప భూస్వామిని
పట్టి లాగరా
ఆ చిన్నచిన్న రైతులకీ గుట్టు చెప్పరా
ఆ గుట్టు చెప్పరా ॥నబో॥

# రిక్షా బండి

బండంటే తొక్కుడు బండి
మూడుండల రిక్షాబండి
నాగుండెను ఇంజనుజేసి
లాగాలి సెంపట పోసి ॥బండి॥

నాకండలు కరుగుతుంటాయ్
ఆ వుండలు తిరుగుతుంటాయ్
ఆ వుండలు లాగుతుంటే
నా గుండెలు పీకుతుంటే
ఆ ఎండా వానలోనూ
నే నుండీ బతుకుతానూ ॥బండం॥

ఆ కిలింగ్ కిలింగ్ బెల్లూ
కొట్టాలి కదిపి ఒల్లూ
మట్టాలి దమ్ము కాసీ
నోరూపిరల్ల తీసీ
ఆ పసువు లాగ నేనూ
పనిచేసి బతుకుతాను ॥బండం॥

నే పెడలు మీద ఎక్కి
నామక్క పిక్కలు నొక్కి
నే తొక్కి-తొక్కి-తొక్కి
తెస్తాను ఒక్క రూపాయ్
ఎజమాని రిక్షా అద్దె
ఇస్తానుర ఆ పొద్దే ॥బండం॥

పోలమ్మ తల్లికి మొక్కి
పొద్దల్ల రిక్షా తొక్కి
గంటల్ల సెంపట కక్కి
గటునాన డబ్బు దాసీ
పోలీసు బాబుకి రోజూ
కట్టాలి సేతి ఫీజూ ॥బండం॥

నా కరువు కొద్ది నేను
బరువేసి తొక్కు తాను

ఆ ఎత్తు పల్లములోను
ఆ టైరు మెత్త బడితే
వస్తాడు సేటు బాబూ
సేత్తాడు డాబు-డాబూ ॥బండం॥

నా ఎముకలు ఎగబెట్టి
ఆ బ్రేకులు బిగబట్టి
ఆ పంచదార బస్తా
ఒక పావలాకు తెస్తా
ఆ పావలాను నేను
ఆ వడ్డీలోడు కిస్తా ॥బండం॥

పదేల నుండి నేను
రిక్షాను తొక్కుతున్నా
రూపాయి కొక్కసుక్కా
రక్తాన్ని పిండుతున్నా
ఒక బొక్కి రిక్షా నైనా
కొని సవ్వలేదు రన్నా ॥బండం॥

గుమ్మల్లో రిక్షా తొక్కి
నాగుండె కుల్లిపోయె
వుండల్ని తిప్పి తిప్పి
నా వూపిరాగిపోయె
మూటల్ని ఎత్తి దించి
ముసిలోడి నయ్యిపోయె ॥బండం॥

ఇకనుండి గాని నేను
ఆ కూలి సంగంలోను
పోరాడి బతుకుతన్నా
రైతన్నల సంగంలోను
ఆ సెయ్యి సెయ్యి కలిపి
ఎదిరించి బతుకుతాను ॥బండం॥

# జ్ఞాన విజ్ఞానాలమధ్య వైరుధ్యం

—కొడవటిగంటి కుటుంబరావు

జ్ఞానానికీ, విజ్ఞానానికీ మధ్య తేడా మాత్రమే కాకుండా వైరుధ్యాలకు అవకాశాలుంటాయని కూడా గుర్తించాలి. వైరుధ్యాలకు మూలకారణమేమంటే, విజ్ఞానం ప్రకృతికి సంబంధించినది, జ్ఞానం మానవ ప్రకృతి పునాదిగా గలిగి, దాని అవసరాల కోసం రూపొంది, అవి మారినప్పుడు మారి, అవసరం తీరినాక అంతరించటమో, మూఢ విశ్వాసాల రూపంలో అజ్ఞానంగా దిగబడి పోవటమో జరుగుతుంది.

జ్ఞాన విజ్ఞానాలకు తేడా ఉన్నట్టే, సంబంధం కూడా ఉన్నది-లేకపోతే మనం విజ్ఞానాన్ని పూర్తిగా విసర్జించే ఉందుము. అదీగాక వైరుధ్యంలో సమైక్యత కూడా ఉండితీరుతుందని మనకు తెలుసు. ఉదాహరణకు నిప్పు తీసుకుందాం. నిప్పుకు గల ప్రకృతి సిద్ధ గుణాలు మనిషికి విజ్ఞానం అయాయి. నిప్పుతో జ్వాల వెలిగించి, చీకటిలో మసలటమూ, చలికాచుకోవటమూ లాంటి చిన్న ప్రయోజనాల నుంచి, ఆహారంపచనం చేసుకోవటమూ, లోహాలను కరిగించటమూ, మట్టి నుంచి పాత్రలనూ, ఇటుకలనూ, తదితర రసాయన ప్రక్రియలనూ సాధించటమూ, ఇనుప పరికరాల సృష్టి జరగక పూర్వం అరణ్యాలు తగులబెట్టి, భూమిని సాగులోకి తీసుకురావటమూ లాటి భారీ ప్రయోజనాలు మనిషి సాధించగలిగాడు. నిప్పును గురించిన విజ్ఞానం నుంచి ఎంతో సాంకేతిక పరిజ్ఞానం మనిషికి సాధ్యమయింది - అగ్నిగుండాలూ, ఇటుకలూ, కుండలూ సున్నపురాయి వగైరాలు కాల్చే ఆములూ, వంట పొయ్యిలూ, లోహం కరిగించటానికి అనువైన మూసలూ, బట్టీలూ, ఇంధనాలుగా పనికివచ్చే రకరకాల కలపలూ, తైలాలూ వగైరాలు కనిపెట్టబడ్డాయి. ఈ సాంకేతిక జ్ఞానం, ఒక్క నిప్పు నుంచే చూసుకున్నా, మానవుడి సామాజిక పరిణామానికి ఎంతగా దోహదం చేసిందీ మనం గుర్తించగలం. ఇంకో గమనించదగిన విశేషం ఏమంటే నిప్పును గురించిన విజ్ఞానం క్రమంగా అభివృద్ధి చెందుతూనే వచ్చింది. అది శాస్త్రవేత్తలకు ఎన్ని రకాలుగా ఉపయోగించుతున్నదో మనం ఊహించను కూడాలేం. పదార్థాలను మండించి వాటిలో ఉన్న మూలకాలను తెలుసుకోవటం నుంచి, కొన్నికోట్ల సంవత్సరాల దూరాన ఉన్న నక్షత్ర కాంతి నుంచి స్పెక్ట్రాలు తీసి, వాటిలో చేరి ఉన్న పదార్థాలను కూడా శాస్త్రజ్ఞులు అంచనా వేయగలుగుతున్నారు. అయినా ఆదిమమానవులకు ఉపకరించిన నిప్పుజ్ఞానం కాలక్రమాన కొంత నిరుపయోగమయింది. ఇనుప పరికరాలు వచ్చినాక అరణ్యాలను నిర్మూలించటానికి నిప్పుతో పనిలేకుండా పోయింది. బొగ్గూ, నేలబొగ్గూ, వంటగాసూ సమిధల అవసరాన్ని పోగొట్టాయి. నిప్పుతో నడిచే పరిశ్రమలు వాతావరణ కాలుష్యాన్ని పెంచితే,

అదే నిప్పుతో ఉత్పత్తి అయిన "థర్మల్" విద్యుత్తుతో కాలుష్యంలేని పరిశ్రమలు సాధ్యమయాయి. ఈనాటి లోహపరిశ్రమలలో కొలిములు అవసరంలేదు, బట్టీలకు ఇంధన తైలాలూ, విద్యుత్తూ కూడా వాడతారు. చివరకు శవదహనానికి కూడా ఎలెక్ట్రిక్ క్రిమెటోరియాలున్నాయి.

పైన చెప్పినదాన్నిబట్టి విజ్ఞానానికీ, జ్ఞానానికీ వైరుధ్యం కూడా స్పష్టమవుతుంది. ప్రజలను నాగరికతజేసి నడిపిన నిప్పే, పూరికొంపలను తగులబెట్టగలదు. దుర్మార్గులకు సంఘ విద్రోహ సాధనంగా పనిచేయగలదు. గ్రామాలలో కక్షల మూలంగా కుప్పలూ వాములూ, ఇళ్లు తగులబెట్టటం తరచు జరిగేదే. మనుషులు గుహలలో జీవిస్తూ, వ్యవసాయం తెలియకుండా పరిగ ఏరుకుని, వేటాడి జీవించిన కాలంలో నిప్పుకు సంబంధించిన జ్ఞానవిజ్ఞానాల మధ్య వైరుధ్యం ఇలాంటి రూపంలో ఉండే అవకాశంలేదు. ఈ వైరుధ్యం సామాజిక పరిణామంలో వచ్చినది. పంటకుప్పలు వ్యక్తిగతమైన ఆస్తి కావటంలో వ్యక్తుల మధ్య శత్రుత్వం సమాజానికి అరిష్టమయింది. అలాగే కాల్చిన ఇటుకలు కనిపెట్టిన ఆరేడు వేల ఏళ్ల అనంతరం ఇంకా ఇటుకల ఇళ్లలో ఉండటానికి నోచుకోని దారిద్ర్యంతో అలమటించేవారి ఇళ్లు మానవ ప్రయత్నంతోనేగాని, యాదృచ్ఛికంగా గాని దేశంలో ఏటా లక్షల సంఖ్యలో తగల బడుతున్నాయి. ఇవి పరిష్కారంలేని వైరుధ్యాలుకావు. సహకార వ్యవసాయమూ, సమిష్టి వ్యవసాయమూ పరిపాటి అయిన వ్యవస్థలో "కుప్పకాపలాలు" అవసరంకావు. అగ్ని ప్రమాదానికి గురికాని ఇళ్లు అందరికీ ఉండవచ్చు, ఇదంతా ఎవరికి వారు చేసుకున్న "ఖర్మ" కాదు, అధిక సంఖ్యాకులకు అల్ప సంఖ్యాకులు తెచ్చిపెట్టిన "ఖర్మ".

వర్గసమాజంలో జ్ఞానానికీ, విజ్ఞానానికీ వైరుధ్యాలు అడుగడుగునా వందల, వేల సంఖ్యలో ఎదురవుతాయి. విజ్ఞానం ద్వారా మనిషికి లభ్యమైన మారణాయుధాలూ, అణుశక్తీ, భయంకర విషవాయువులూ, విషక్రిములూ తలుచుకుంటే ఆలోచనారహితంగా విజ్ఞానాన్ని శపించబుద్ధి అవుతుంది. కాని జన సామాన్యంలో విజ్ఞాన విద్వేషం పీడక వర్గాలకు మేలు. అందుచేత ప్రజలు ఆ ఊబిలో దిగబడరాదు, విజ్ఞానంవల్ల విరుద్ధ ఫలితాలు కలగటానికి అసలు కారణాలు ప్రజలు తెలుసుకోవాలి. వారికి తెలియజెప్పాలి.

పారిశ్రామిక విప్లవ కాలంలో కార్మికులు యంత్రాలను శత్రువులుగా భావించి, వాటిని ధ్వంసం చేస్తే సమాజం బాగుపడుతుందని అపోహపడ్డారు. అలాగే ఫ్రెంచి విప్లవ కాలంలో ప్రఖ్యాత శాస్త్రవేత్తలను గిలోటైన్ కింద పెట్టుతూ, "విప్లవం తరువాత శాస్త్రజ్ఞులతో పని ఉండదు," అని అపోహపడ్డారు.

కాని వాస్తవంగా జరిగిన దేమిటి? మార్క్స్ చెప్పినట్టు వలసవాదం తనవలసలలో తన దోపిడీ కొనసాగించగలందులకు ఉపయోగించిన సాంకేతిక జ్ఞానంతో రైళ్లూ, తంతి తపాలాలూ, అచ్చుయంత్రాలూ, వారు పెట్టుబడి ఎగుమతి చేసి నెలకొల్పిన పరిశ్రమలూ, నీలి మందులాంటి కొత్త పంటలూ, తేయాకూ, కాఫీ తోటలూ, వాటికి ఆధారభూతమైన విజ్ఞానమూ, విముక్తి పోరాటాలకు చక్కగా ఉపకరించాయి.

అంత మాత్రాన జ్ఞాన విజ్ఞానాల మధ్య వైరుధ్యం శాశ్వతంగా అంతరించిందా? లేదు. అణుశక్తిని మనం అరువు తెచ్చుకున్నాం. దానికి అవసరమైన సాంకేతిక జ్ఞానం మనకులేదు. తారాపూర్ రియాక్టరుకు ముడి యురేనియం పనికిరాదు, అందులో ఉండే 235 యురేనియం కనీసం నాలుగైదింతలు అయితేనేగాని అది రియాక్టరు ఇంధనంగా పనిచెయ్యదు. దాన్ని మనకు అమెరికా అమ్మకపోతే మన ఆటకట్టే!

స్వాతంత్ర్యం వచ్చిన సంబరంలో మనం అతి ఆధునిక వినియోగ వస్తువులను జీవితావసరాలు చేసుకున్నాం. కాని వాటిని ఉత్పత్తి చేసే సాంకేతిక జ్ఞానమూ, దానికి ఆధారభూతమైన విజ్ఞానమూ మనకు అందుబాటులో లేవు. కారు కొనగల వాళ్లందరూ కారు నడపలేరు; కారు నడపగల వాళ్లందరూ దాన్ని మరమ్మతు చెయ్యలేరు. ఇవి అల్పవైరుధ్యాలు. ఇవి స్థానికంగా పరిష్కారం అయినంత మేరకు మనని బాధించవు. కాని మొదలు కార్ల తయారీయే సంజయ గాంధీ లాంటి వక్రబుద్ధులకూ, మిడిమిడిజ్ఞానంగల వాళ్ళకూ అప్పగిస్తే?

విజ్ఞానం మాటకువస్తే, వర్గ సమాజాలలో దాన్ని సొంతం చేసుకునే వాళ్ళు అస్తిలాగే చూసుకొని ఇతరులకు అందనియ్యరు-అంటే దాన్ని దోపిడీ సాధనంగా ఉపయోగిస్తారు. అణుశక్తి రహస్యాలు వెల్లడించారన్న ఆరోపణమీద అమెరికాను పాలించేవారు ఉరిశిక్షలు విధించారు. కాని ఇదే దోపిడీ వ్యవస్థలో మనుషులు పాటించదగిన జ్ఞానాన్నిచట్టబద్ధం చేస్తారు నేరంచేసినవాడు, "నాకు చట్టం తెలియదు", అంటే ఒప్పుకోరు. మనుషులు ఎట్లా బతకాలో, ఎట్లా తినాలో, ఎవరికెవరు ఎంతమంది పిల్లలను కనాలో, అశక్తుడైనవాడు ప్రాణంనిలుపుకోవటానికి ఏ మార్గాలు అవలంబిస్తే ఏ శిక్షలుపడతాయో చట్టాలు చెబుతాయి. "అజ్ఞానం సాకు కాదు".

జ్ఞానవిజ్ఞానాలమధ్య వైవిధ్యం పెట్టుబడిదారీలో పరాకాష్ఠ అందుకునేది యుద్ధరంగంలో. యుద్ధ "ఇంధనాల" కొరకు మంచి యువకులను ఎన్నుకుని, అవిటివాళ్ళనూ, ముసలివాళ్ళనూ వదిలేస్తారు. యుద్ధంలో చేర నిరాకరించటం శిక్షార్హం. యుద్ధంలో సైనికులను చంపడానికి విజ్ఞానం అత్యద్భుత ఆయుధాలను

సరఫరా చేస్తుంది. గాయపడిన వారిని తిరిగి యుద్ధరంగానికి పంపటానికి అత్యుత్తమ వైద్యవిజ్ఞానం ఉపయోగించబడుతుంది. ఇదంతా మామూలు మనిషికి హాస్యాస్పదంగా కనిపించవచ్చు. కాని పెట్టుబడిదారీ ఈ హాస్యాస్పదమైన వ్యవస్థ లేకుండా కొనసాగలేదు.

అలాగే ఆహారోత్పత్తి రెట్టింపు అయిన కాలంలోనే ఆకలి చావులూ రెట్టింపు కావచ్చు. విజ్ఞానం ఫలసాయం పెంచగలదు. కాని సామాజిక జ్ఞానం అందరికీ తిండికొనే డబ్బును ప్రసాదించదు. పై పెచ్చు శాసనాలద్వారా అధిక సంఖ్యాకులకు డబ్బు అందకుండా చేస్తుంది. దాన్నే పెట్టుబడిదారీ ఆర్థికజ్ఞానం అంటారు. ఈ ఆర్థికజ్ఞానం కోట్లకొద్దీ టన్నుల ప్రమాణంలో ఉన్నదన్నమాటేగాని, ద్రవ్యోల్బణం ఎందుకు వస్తుందో, నిరుద్యోగ సమస్యను పెంచకుండా ద్రవ్యోల్బణాన్ని తగ్గించే దెలాగో పెట్టుబడిదారీ ఆర్థికజ్ఞానం ఎరగదు. సోషలిస్టుజ్ఞానం ఎరుగును, కాని చట్టరీత్యా అలాటి జ్ఞానం పెట్టుబడిదారీలో శిక్షార్హం.

విజ్ఞానాన్ని సంఘ ద్రోహానికి ఉపయోగించగలవారు జ్ఞానాన్ని శిక్షార్హం చేయలేరా? మానవ సమాజ పరిణామం ఏ యుగంలోనైనా జ్ఞానవిజ్ఞానాలమధ్య వైరుధ్యాన్ని పరిష్కరించడం మీదనే చాలావరకు ఆధారపడుతుంది.

---

# అమరులు

ఎ. ఎస్.

అందర్నీ సాదే
పైర్లు, పొలాలు
భూమంతా—
కొన్ని కబంధ హస్తాల్లో
చిక్కుపడిన చోట—
ఫ్యాక్టరీలు,
యంత్రాలు, సీలలు, మరలు
ముళ్ళకంచెల్లో బంధింపబడ్డచోట—
పల్లెల్లో, పైర్లల్లో,
పట్నాల విద్యుత్తు తీగల్లో
తీగలు ప్రసారం చేయజాలని
విద్యుత్తు మండుతోంది.
వాళ్ళుద్భవిస్తారు...
కుట్రలనూ, కుత్సితాలనూ,
వంచనలనూ, దోపిడీని
కౌగలించుకొన్న వ్యవస్థ
మొఖంమీద సమ్మెటపోట్లేస్తారు.
కానీ, వాళ్ళురితీయబడతారు.
కాల్చివేయబడతారు.
ఉరితాళ్ళు తెగిన మనిషి
చివరి రక్తనాళంలో
బీజం మొలకెత్తుతుంది
కాల్చివేయబడ్డ తూటా రంధ్రంలోంచి
గాయం లోంచి-కొత్త మొలక
చివురు తొడుగుతుంది.
వాళ్ళు మళ్ళీ ఉదయిస్తారు.
వ్యవస్థను అసహ్యించుకుంటారు
నగరం నడిబొడ్డు
ఉక్కుపిడికిలిని బద్దలేస్తారు—
ఇనుప గొలుసులు తెగిపడ్తాయి.
కవులు, మేధావులు
వాళ్ళను కీర్తిస్తారు
ఆకాశపుటంచులు
గౌరవ సూచకంగా తలలు వంచుతాయి.
వాళ్ళే జయిస్తారు...
ఎందుకంటే వాళ్ళు అమరులు కనుక...

---

భోజ్‌పూర్

# సూర్యాన్వేషణలో గీతాలు

దక్షిణ బీహార్‌లో సోనీ నదీ తీరం ఒడిలో భోజ్‌పూర్ జిల్లావుంది. ఇవ్వాళ తన వొడిలోని భోజ్‌పూర్‌ను ఊపుతూ సోనీనది ఒకగీతం వినిపిస్తోంది. ఆ ప్రాంతంలో వున్న ముషాహర్లు, హరిజనులు ఆగీతానికి ప్రతికలువుతున్నారు–తమ బాధలూ, ఆశలూ పల్లవిస్తూ నూతన వ్యవస్థకోసం చేస్తున్న పోరాటాన్ని ప్రతిధ్వనిస్తూ.

భోజ్‌పూర్ సాంస్కృతిక చరిత్రలో మొదటి సారిగా ప్రతిఘటన, ఆకాంక్ష తమ వ్యక్తీకరణను బలంగానూ స్పష్టంగానూ పాటల్లో వెతుక్కుంటున్నవి.

1857-58లో బ్రిటిష్ వ్యతిరేక కువార్‌సింగ్ తిరుగుబాటులో వీరగీతాల వారసత్వం వుంది. జాతీయోద్యమ కాలంలోని సాంస్కృతికరంగంలో ఏవోకొన్ని మినహాయింపులతో, పాల్గొన్న వారంతా ఉన్నత వర్గాలవారే.

1947 తర్వాత కొత్త శక్తులు పుట్టుకొచ్చాయి. కాంగ్రెస్ నుంచి విడిపోయిన లోహియావర్గం షహబాద్ గ్రామీణప్రాంతానికి 'హరిజన' ఉద్ధరణ అస్పృశ్యతా వ్యతిరేక ప్రచారం, సాంఘిక సంస్కరణ అనే ఆశయాలతో కార్యకర్తలను పంపించింది. ఆర్థికాభివృద్ధి విషయంలో పంచవర్షప్రణాళికలోని 'ప్యాకేజి కార్యక్రమం' కింద అక్టోబర్ 1960 లో జిల్లా వ్యవసాయాభివృద్ధి కోసం తీవ్రకృషి అనే కార్యక్రమం చేపట్టబడింది. సోనీకాలువ వల్ల లభించే నీటివసర్లు, విత్తనాలు, ఎరువులకు సంబంధించిన ఉన్నత సాంకేతిక పరిజ్ఞానము, సామ్యవాద సిద్ధాంత చైతన్యము, హరిజనుల్లోనూ, ఇతర బలహీనవర్గాల్లోనూ ఒకకొత్త కనువిప్పును తెచ్చిన మాటనిజమే. కాని ఈ వసర్లను, పరిజ్ఞానాన్ని వాడుకోగల అవకాశము వున్న నూతన సంపన్న వర్గాలకు, ఆ అవకాశము ఏమీలేక వొళ్ళమ్ముకొని బతికే బనిహార్ల (కూలీల)కు మధ్యన ఆర్థిక వ్యత్యాసాలు మరింతగా పెరిగాయి. భోజ్‌పూర్ గ్రామీణ ప్రాంతాల్లో, ఏదోసామెత చెప్పినట్లుగా, బనిహార్ల పరిస్థితులు దినదినమూ మరింత క్షీణించాయి.

ఇవ్వాటికీ భోజ్‌పూర్‌లో ఎక్కడా కూడ రాష్ట్రప్రభుత్వం శాసనంచేసిన ప్రకారంగా కనీసవేతనాలు బనిహార్‌కు ఇవ్వడంలేదు. నడుములిరిగేట్లుగా పని చేస్తే బనిహార్‌కు 'ఖేసరి' (పందులు తినే తిండి) అనే ధాన్యం ఇస్తారు. ఖేసరి అంటే తాలు అనిఅర్థం. ఇది పక్షవాత రోగాలకు, చర్మవ్యాధులకు ఎముకల వ్యాధులకు దారితీస్తుంది.వ్యవసాయపు పనులు లేనప్పుడు అతడు పస్తుపండాల్సిందే.

కొందరు పాట్నా, ముజఫర్‌పూర్ పట్టణాలకు వలసవెళ్ళి రిక్షాలులాగి బతుకుతున్నారు. తమ పేదరిక స్వరూపానికి ఏక్వారీ గ్రామానికి చెందిన ఒక ముషాహర్ పాటగట్టాడు.

సుధాము భార్య దుఃఖిస్తూ చెప్తున్నది.
రోజులు గడ్డుగా వున్నాయి
తినడానికి సత్తుపిండి కూడలేదు
రోజులు గడ్డుగా వున్నాయి
తలదాచుకోడానికి గుడిసెలేదు
రోజులు గడ్డుగా వున్నాయి
కాళ్ళకి చెప్పులులేవు

నాలుగవ సాధారణ ఎన్నికల్లో 1967 లో బీహార్‌లో సోషలిస్టులు అధికారంలోకి వచ్చారు. గ్రామాలకు తమ మొహం తప్పించారు. అదేకాలంలో ఉత్తర బెంగాల్‌లో నక్సల్బరీ తిరుగుబాటు బ్రద్దలయింది. గ్రామీణ బీహార్‌కు ఆనిప్పు రవ్వలు ఎగసివచ్చాయి.

అమాయకులైన, నిరక్షరాస్యులైన, ఎంతోకాలంగా దోపిడీకి గురవుతున్న వారు ముషాహర్లు హరిజనులు శత్రువును గుర్తించారు. ఈ చైతన్యాన్ని ఒక ముషాహర్ ఇట్లా పాటలో చెప్పాడు.

"వాళ్ళెట్లా మారుతారు ?
దుర్మార్గాలకు వొడిగట్టిన
వాళ్ళెట్లా మారుతారు ?"

ఆ మారని దుర్మార్గుల నెదిరించే మార్గం వాళ్ళకు నక్సల్బరీ చూపింది. అప్పుడు తలయెత్తిన శక్తులు ఇంకా విజృంభిస్తున్నాయి. శివపూజనులు, థానా సింగ్‌లు (స్త్రీలను చెరచే వాళ్ళు, భూస్వాముల గూండాలు) భోజ్‌పూర్ ముషాహర్ల చేతుల్లో ఇవ్వాళ శిక్షలనుభవిస్తున్నారు.

ఇనుప ముళ్ళ తీగెల పోలీసు క్యాంపుల నీడల్లో, మెషిన్‌గన్‌ల తెరుచుకున్న నోళ్ళ కింద, అనునిత్యం అమలవుతున్న సాయుధ భూస్వామ్య సిండికేట్ల, ప్యారా మిలిటరీ హింసల ఛాయల్లో ఒక కొత్త గీతం పుడుతున్నది. గాయపడి, కాలు విరిగిన బుటాన్ ముషాహర్ పెదవులపై చనిపోయే వేళ ఈ గీతం దరహాసం వినిపించింది.

'నిశ్చయంతో, త్యాగమంటే నిర్భయంతో

పోరాటంలో స్థిరత్వంతో, విజయం పట్ల విశ్వాసంతో
నేనెక్కడ చూసినా,
కష్టజీవులు మేల్కొంటున్నారు.'

పాట అట్లా గాలిలో ప్రతిధ్వనిస్తూనే వున్నది. హరిజనుల మురికి ఆవాసాల నుంచి దక్షిణ వాయువు ఈ పాటను ఉత్తరానికి - భూస్వాముల బెదురు గుండెల చెవుల్లోకి తీసుకపోతున్నది- అక్కడ నుంచి భూస్వాముల ఇరుకు గోడలను ఛేదించుకొని సోనీనదీ తీరాల్లోకి నూతన సూర్యుణ్ణి వెతుకుతూ, పిలుస్తూ - సాగిపోతున్నది.

## భోజ్‌పూర్ ఉద్యమానికి వేగుచుక్కలు

నక్సల్బరీ ప్రభావంలో ప్రభాత భేరీ మోగించిన భోజ్‌పూర్ ఉద్యమానికి వేగుచుక్కలు జగదీశ్ మహతో, రామేశ్వర్ అహిర్. జగదీశ్ మహతో శ్రీకాకుళ ఉద్యమంలో వెంపటాపు సత్యం వంటివాడు. రామేశ్వర అహిర్‌ను చైనా విప్లవంలో చూటేతోనో, మన్నె ప్రజల పోరాటానికి ఊపిరి అల్లూరి సీతారామరాజుతోనో పోల్చవచ్చు.

జగదీశ్ మహతో కోయిరీ కులస్థుడు. అర్రాలోని ఎచ్. డి. జైన్ పాఠశాలలో సైన్స్ టీచర్. ప్రతిభాశాలి. మంచి ఉపాధ్యాయుడుగా, సాంఘిక సంస్కర్తగా ఆ ప్రాంతం అంతటా మంచి పేరుంది. ఆయనకు సోషలిస్టులతో కూడ సంబంధాలు వుండేవి. 1967 ఎన్నికల్లో తన గ్రామం ఏక్వారీలో ఎన్నికల ప్రచారంలో పాల్గొన్నాడు. ఏక్వారీ గ్రామం వున్న భోజ్‌పూర్ జిల్లా సహార్ సమితి నుంచి సి. పి. ఐ. అభ్యర్థి రామ్‌నరేశ్ రామ్‌కు ఆయన ప్రచారం చేశాడు. ఆ ప్రాంతంలోని పేదలు, వ్యవసాయ కార్మికులు ఆయనను బలపరిచారు. ఓటింగు జరిగిన రోజున ఒక బూత్‌లో అగ్ర వర్ణానికి చెందిన ఒక భూస్వామి 'రిగ్గింగ్' (అక్రమ ఓటింగ్) చేశాడని నిరసన తెలిపినందుకు జగదీశ్ మహంతోను విపరీతంగా కొట్టారు. ఈ సంఘటన సౌమ్యుడైన ఈ బడి పంతులును భూస్వామ్య అణచివేతకు వ్యతిరేకంగా పోరాడే విరామం లేని యోధునిగా మార్చింది.

1970 లో ఇతనితో రామేశ్వర్ అహిర్ కలిశాడు. ఆయనది కూడా ఏక్వారీ గ్రామమే. రామేశ్వర్ అహిర్ మొదట బందిపోటు దొంగ. ఒక హత్యా నేరంపై పన్నెండు సంవత్సరాల జెయిలుశిక్ష అనుభవించి 70 లో తన గ్రామానికి తిరిగి వచ్చాడు. జెయిల్లో అతడు పూర్తిగా మారిపోయాడు. 'సాధువు'గా రూపొందాడు. సాంఘిక అణచివేతను ఎదిరించాలని నిశ్చయించుకొన్నాడు. ఈ ఇద్దరూ ఒకరి భావాలతో ఒకరు ఆకర్షితులయి కలిసి పనిచేయా

లని నిర్ణయించుకున్నారు. కోర్టుకువెళ్ళి తమ ఆస్తినంతా పేదల పేరుమీద రాసి ఇల్లు వదిలారు.

1972 లో జగదీశ్ మహతోను పోలీసులు పట్టుకొని కాల్చివేసారు. 1975 జనవరి 14 మకర సంక్రాంతి రోజు 'సాధూజీ' రామేశ్వర్ అహిర్ పోలీసులకు దొరికాడు. ఆయన చేతులకు సంకెళ్ళువేసి, నడుముకు తాడుకట్టి జీపులో ఎక్కించుకొని పోలీసులు తీసుకపోతున్నారు. ఆయన అలసిపోయి బల హీనంగా వున్నాడు. కాని ఆయన నుదురుమీద ఘోరాటదీక్ష జ్వలిస్తున్నది. ధమ్నియా కల్వర్టు (మలుపు) దగ్గరికి జీపు వచ్చింది. ఆయనకంతా ఒక్క సారి చిరపరిచితమైన ప్రాంతంగా కనిపించింది. విశాలమైన పచ్చని మైదానాలు, పసుపు పచ్చని పూలు ఈ కల్వర్టు మీదుగా ఇలాగే తనను పోలీసులు తీసుకు వెళ్ళి దశాబ్దంకన్నా ఎంతో కాలం గడిచింది. అప్పుడూ ఇలాగే గొలుసులతో బంధిం చారు. కాని ఇప్పుడు ఆయన బందిపోటు దొంగ కాదు. తీవ్రమైన కోపావేశం ఆయన నెత్తురులో రగిలింది. డ్రైవర్‌ను జీపు ఆపమని ఆజ్ఞాపించాడు. జీపు వేగం తగ్గింది. పోలీసులతో ఘర్షణపడ్డాడు. పోలీసులు పట్టుకో ప్రయత్నించారు: కాని ఆయన క్రిందికి దూకాడు. అక్కడ నుంచి కదలడానికి నిరాకరించాడు. తన చూట్టూ వున్న పచ్చనిపూల నేలతల్లి ఒడినుంచి ఆఫీసర్‌తో దమ్ములుంటే తనను కాల్చమన్నాడు. వాళ్ళతన్ని జీపులోకి ఎక్కించుకోవడానికి పెనుగు లాడారు. ఆయన సుతరాము లొంగ లేదు. ఆయన చాల శక్తివంతమైన దృఢ కాయుడు.

"నేను నేరస్థుణ్ణి కాను. నన్ను కాల్చండి. కొని నేను లొంగను. నేను జైలుకురాను. నేను బందిపోటు దొంగను కాను. నేను అణగారిన ప్రజల కొరకు పోరాడుతున్నాను. నేను స్త్రీల గౌరవము కొరకు పోరాడు తున్నాను. ఒకరోజు వస్తుంది. దున్నేవాడే ఈ నేలను అనుభవించే రోజు తప్పక వస్తుంది. మీరు నన్ను చంపినప్పటికీ ఇది సంభవించకుండా ఆపజాలరు. నా వెనుక ఇంకెంతో మంది నాలాంటి వారు మిగిలేవుంటారు. అపును మీరు తీవ్రంగా గాలిస్తున్న రామేశ్వర్‌ను నేనే"

ఆఫీసర్ అతన్ని జీపులోకి రమ్మని అరిచాడు. రామేశ్వర్ కోపంతో సంకెళ్ళుబడ్డ తనచేతులను ఊపాడు. బదులుగా ఆఫీసర్ రెండుసార్లు కాల్చాడు. రామేశ్వర్ నేల మీద పడిపోయాడు. ఆయన కళ్ళల్లోంచి సన్నని వెలుగులాగా నెత్తురు నేలలోఇంకింది. ధామ్నియా దగ్గర కల్వర్ట్‌కు సమీపంలో రామేశ్వర్ ప్రయాణం ముగిసింది.

మరుసటిరోజు అర్రాలోని గాంగ్రియాఘాట్ ఒడ్డున ఒక వృద్ధుడు జీర్ణ జీవి చలిలో రాత్రి ఈదర గాలిలో వణుకుతూ తన కొడుకు శవంచుట్టూ అగ్ని

# విలువలు

టి. పెద్దిరాజు

సామారంగంచౌక్‌లో సాంబ్రాణి పుల్లలమ్మే సాయిబును మీరెప్పుడైనా చూశారా ? వాడి పేరు మస్తాన్. హాజీ మస్తాన్ కాదు రౌడీ మస్తాన్.

పూర్వాశ్రమంలో పిక్‌పాకెట్ రాకెట్ అనే పిల్చేవారు. అందులో వాడి ప్రజ్ఞా పాటవాలు అలాంటివి.

ఇంత బతుకూ బతికి ఇంటి వెనుక చచ్చినట్టు వీడు పూలమ్మిన చోట కట్టెలమ్ముతున్నాడేమా అని విస్తుపోయి చూశా మొట్టమొదట.

ఐదు పూట్ల నమాజు చేసే ఖాజీ లాగా ఒదివి పెట్టిన గడ్డము.

దర్జీ పని వాని అంగుష్టం లాంటి నెత్తిమీద కపిని. ఒకప్పటి చేతి పని వాని రూపే మాసిపోయింది. జేబులు కొట్టే వాణ్ణి చేతిపనివాడుగా వర్ణించటం వ్యంగ్యంకోసం కాదు.

దాన్ని కళాత్మకమైన వృత్తిగా ఆరాధించాడు. జీవించటం కోసమే దాన్ని ఆశ్రయించాడు. అది అందరికీ సాధ్యం కాదు. అందుకే వాణ్ణి గురించి చెప్పటం.

---

జ్వాలలు ఎగెయ్యడం చూసాడు. తెల్లవారి ఉదయం అక్కడ బూడిదకూడ లేదు అక్కడ తిరుగుతున్న ఒకవృద్ధసాధువు కొంతమంది పోలీసులువచ్చి ఆ బూడిద తీసుకపోయారని వారిలో కొందరు పోతూ పోతూ ఆ బూడిద తమనుదుట రాసుకున్నారని చెప్పాడు.

సహార్‌కువెళ్ళే సుదీర్ఘమైన మెలికలుతిరిగే రోడ్డువెంబడి ఒక సూటిపాట పయనిస్తుంది. దుఃఖంతో మందంగా ధ్వనించేగొంతు ఆ పాటకు శృతికలుపుతాయి.

"మేం మా విషాదాన్ని వ్యక్త పరచలేం
బారుహీ బారునా బాషు విషాదంతో దుఃఖిస్తున్నాయి
వినమ్రమైన శిరస్సు దుఃఖాన్నిశ్వాసిస్తున్నది
అందరూ ఏడుస్తున్నారు
మేం మా విషాదాన్ని వ్యక్తం చేయలేం"

పాట సుళ్ళు తిరుగుతుంది. బారునా, బాషు, బాహున్ మొదలైన గ్రామాల్లోని ముషాహర్ల హరిజనుల చీకటి మురికి ఇరుకు గుడిసెల్లో ఇదేపాట సుళ్ళుతిరుగుతూ ఉంటుంది. వాళ్ళు తమ 'సాధూజీ' కొరకు దుఃఖిస్తుంటారు-

ఆ వృత్తి పట్ల వాడికి కొన్ని ప్రిన్సిపుల్స్ ఉన్నాయి.

స్త్రీలు, పిల్లలు, వృద్ధులు వాని పని పరిధులలోనికి రారు.

పారేసుకున్న పర్సును వాడు ఓరకంటితో కూడా చూడడు.

ఇతరులకు అసాధ్యంగా కనిపించే జటిలమయిన పనులను సునాయాసంగా చేయటం వాడి ప్రత్యేకత.

ఆకు పనిలో వాడికి సాటి పనివాళ్ళు ఆంధ్ర దేశంలోనే కాదు. దేశం మొత్తం మీద అరుదని చెప్తారు నిపుణుడైన సర్జన్. కడుపు కోసి కంతి తీసినంత ఒడుపుగా ఎక్కడో దాచుకున్న సంచిని. ఆకుతో ఆపరేట్ చేస్తాడు. తన వృత్తిలో ఆకుతో అంత అవసరమున్నా ఆయుధాన్ని మాత్రం వాడెప్పుడూ దుర్వినియోగం చేయలేదు.

ఆకును ఆకుగానే చూడాలి. అది చాకు కాదు. వాడి సిద్ధాంతం.

పనిలో దొరికిపోయినప్పుడెవడైనా ఆకుతో గీరేసి పారిపోవటానికే చూస్తాడు.

మనవాడు తప్పించుకోవటానికి వీలులేకపోతే తన్నులైనా కాస్తాడు, స్టేషన్‌కైనా వెళ్తాడు గాని నియమం తప్పడు.

ఈ విషయంలో అణ్వాయుధాల్ని శాంతి ప్రయోజనాలకే వినియోగిస్తామని వాగ్దానాలు చేసే అగ్ర రాజ్యాల నిజాయితీని శంకించగలమేమో కాని వాణ్ణి తప్పుపట్టలేము.

మనకు చాదస్తాలుగా కనిపించే వాడి ప్రత్యేకతల్లో విలక్షణమైనది ఒక్కటి ఇక్కడ చెప్పక తప్పదు.

తను కొట్టేసిన పర్సులో పొరపాటున ప్యాస్‌పోర్టులు, సర్టిఫికెట్లు, రైల్వే టికెట్లు లాంటివి వుంటే వాడు చాలా చిరాకు పడేవాడు. ఈ మనుషులు తమ శ్రమ ఫలితాన్ని ఎలానూ కాపాడుకోలేరు సరికదా కనీసం కాగితం ముక్కలనైనా జాగ్రత్త చేసుకోరే ? అదీ వాడి చిరాకు.

డబ్బు తీసుకుని తిరిగి ఆ పర్స్ కష్టమర్ జేబులో పెట్టే వరకు వాడికి ఊపిరి సలపదు. ఈ పని— కంపోజింగ్‌లో అక్షరాలని కలిపేయటం లాంటిదయితే!

పిక్‌పాకెట్‌లో నెత్తిని నిప్పులు దిమ్మరించుకోవటం లావుంటది.

వాడెప్పుడైనా కుదిరిపోయేది ఇటువంటప్పుడే.

వాడ్ని ఆలిండియా ఫేమస్ చేసింది ఇదే దావు.

ఒకసారి ఢిల్లీ నుంచి కిషన్ గ్యాంగ్‌లో తాంతియా అని టాప్ లీడర్. మనోడ్ని తడవటానికి వచ్చేడు.

ఇద్దరు పనోళ్ళు ఎదురైతే మొదటి చూపులోనే ఒకర్నొకరు తడివేసు కుంటారు.

తన్ను తడవనీక. అవతలోణ్ణి తడివేసినోడు టాప్. వాడ్ని తడవలేక తన్ను తడివించుకున్న వాడు డీన్.

ఒకడ్నొకడు తడివేసుకుంటే అది డ్రా.

ఎవడ్ని ఎవడూ తడవలేకపోతే వాళ్ళు నాసిరకం పనోళ్ళు. పిచ్చోడ్ని తడవాల్సిందే ఇంకెందుకూ పనికిరారు.

తాంతియా సరాసరి మనోడిదగ్గరకే వచ్చి నాకు మస్తాన్ కావాలి అడిగేడు-

తనకోసం వచ్చినోడు పనోడయి ఉంటాడని మస్తాన్ పోల్చాడు.

ఇప్పుడు దొరకడు. కావాలంటే సాయంత్రం కలుపుతాను. అతనితో ఏం పని ? ఎక్కడ నుంచి వచ్చారు ?

ఇతను మస్తాన్ కాకపోయినా పనోడయి ఉంటాడని తాంతియాకి అర్థమైంది.

ఢిల్లీ కిషన్ కంపెనీలో లైన్‌మేన్‌ని. మస్తాన్‌తోనే పని. ఎప్పుడు కలిపితే అప్పుడు పని చూసుకు పోతాను - అన్నాడు.

బహుశా ఇప్పుడే కలవొచ్చు కాస్త చాయ్ తాగుదాంరండి. మాట్లాడు కుంటూ హోటల్ కేసి నడిచారు. టిఫిన్ చేసారు. టీ తాగారు. సిగరెట్లు కాల్చి లేదు. వెయిటర్ బిల్లుతెచ్చి బల్లమీద పెట్టాడు. మనం ఎవరితోనయినా టీకివెళ్తే ఏంచేస్తాం నేనిస్తానంటే నేనిస్తానని పోటీపడతాం. ఇక్కడ అలా జరగలా.

మీరివ్వండి అంటే మీరివ్వండి అనుకున్నారు. కాదు మీరే ఇవ్వండి అన్నాడు మస్తాన్.

పాపం తడివినసంగతి తెలుసుకున్నాడు అనుకుని బిల్లివ్వడానికి కౌంటర్ దగ్గరికి వెళ్ళాడు తాంతియా. ఒకజేబులో చెయ్యిపెట్టాడు ఖాళీగా తగిలింది. రెండవ జేబులో చెయ్యిపెట్టాడు హమ్మయ్య తన పర్సు ఉంది. తెరిచి డబ్బుతీయ

బోయి కొయ్యబారిపోయాడు. క్షణంలో తేరుకొని మెరిసే కళ్ళతో మస్తాన్‌వైపు తిరిగి "నువ్వు! నువ్వు!! మస్తాన్‌వి" అరిచాడు తాంతియా. మస్తాన్ బిల్లు ఇచ్చి బయటికినడిచాడు. ఆరోజు తాంతియాతో పోయిఉంటే హాజీమస్తానే అయ్యేవాడేమో.

స్వార్థంకోసం విదేశాల్లో స్థిరపడేలాంటి ప్రసిద్ధవ్యక్తికాడు మస్తాన్.

ఒకసారి మస్తాన్ కుదిరిపోయి జనం చేతిలో కోటాతినేసి, మంచం నేస్తున్నాడని తెలిసింది. కోటా అంటే బాగా కొట్టిఉంటారు. లేకపోతే ఖర్చుకిచ్చారని సరిపెట్టుకునేవాళ్ళు. కీడు శంకించటం నాకు పాడుఅలవాటు. దెబ్బలు మరీ పెద్దవయి వాడేమయినా అయితే భూభ్రమణం ఆగిపోతుందని కాదుగాని, వాడితో ఉన్న సాన్నిహిత్యాన్నిబట్టి వక్కసారి చూసివద్దామంటే వీలుపడటంలేదు.

ఊళ్ళోనున్న మా పేగాని పొరుగూరు పోయినంత పని.

మున్సిపాలిటీ రాజకీయాల పుణ్యమాఅని ఊరికిదూరంగా ఆ కొసని వాడు ఈ కొసని నేను విసిరివేయబడ్డాం గాని, ఇంతకుముందు పక్క పక్క పాకల్లో పెక్కు సంవత్సరాలు కాపురంచేసినవాళ్ళం, విలువలు వేరయినా ఒకేరకమైన వృత్తి చేతిపనివాళ్ళం. మా మురికిపేటలో ఎవరికి ఏ ఆపదవచ్చినా నెత్తిన వేసుకునేవాడు మస్తాన్ ఒక్కడే. సీజనల్ వానలకి మా పేట మునిగిపోయినప్పుడు- ఎండాకాలం రివాజుగా మా కొంపలు తగలపడినప్పుడు- మున్సిపాల్టీ వాళ్ళను గుబులు పుట్టినప్పుడల్లా మా గుడిసెల్ని పీకి పోగులేసినప్పుడు- మస్తాన్ ఒక్కడూ వందమందిపెట్టుగా పనిచేసేవాడు.

ఇక్కడ ఇంకొకటి చెప్పాలి- ఏ మున్సిపాల్టీకైనా ఇళ్ళుకట్టించిఇవ్వటం ధర్మమైతే- మా మున్సిపాల్టీకి కొంపలు కూల్చటమేపని. మురికిపేటల నిర్మూలనలో భాగంగా వారికి సురక్షితమైన ప్రాంతాలకి మేముతరలివెళ్ళాలి. అదీ ఎన్నికల అవసరాలని బట్టి జరుగుతుంది. ఉదాహరణకి మా పేటలోని ఓట్లన్నీ ఒకపార్టీకే పడేవి. దానికి టౌన్‌లో ఒకసీటు వొచ్చేది. అందుకనిమాకు పునరావాసం ఒకేచోట కల్పించలా. ఊరంతా వెదజల్లారు. ఖాళీ చేయించటానికి వీలు లేని పేట్లని రెండు నియోజకవర్గాలుగా పంచినారు. ఇద్దరు జేబు దొంగలు ఒక పర్సుకొట్టేసేరనుకోండి చెరిసమానంగా పంచుకుంటారు. ఇప్పుడు మా టౌన్‌లో రెండుసీట్లూ ఒకేపార్టీ గెలుస్తుంది. ఆ పార్టీ ఏదో మీకు చెప్పక్కర్లేదుగాని ఇంత చేసినా మస్తాన్‌పై ఉన్న ఒకరకమైన అపనమ్మకానికి కారణం మాత్రం చెప్పాలి. కొందరికి వాడు మరీ ఒళ్ళుకాల్చు కుంటాడనిపించేది. ఎందుకంటే సినిమాభాన్సు దృష్టిలో పెట్టుకుని నాటకాలు రాస్తారు. అట్లాగే కౌన్సిలర్ కాదలచుకున్నప్పుడు నీకు సోషల్‌వర్క్ తప్పదు. ఏదీకానప్పుడు వీడికెందుకింత ఇది.

తీరా వెళ్ళిచూద్దునుగదా మంద కాళ్ళకిందపడి నలిగిన బొండీలాగుంది వాడి ఒళ్ళు. తిన్న దెబ్బలేకాక తిండిలేనితనం కొట్టొచ్చినట్లు కనబడుతుంది.

"ఎలాజరుగుతుంది" అడిగా. మాలాంటి సంసారాల్లో మొట్టమొదటి పరామర్శ అదే. "నీకు తెల్వందేముంది. అదేలాగుతుంది బండి" అదే అంటే అతని మూగ భార్య దుర్గ. వాడే మరోప్పుడు చెప్పుకునే దేవుడిచ్చిన పెళ్ళాం. దుర్గను దేవుడిచ్చిన పెళ్ళాంగా చెప్పుకుంటంలో అర్థంలేకపోలేదు. ఒకానొక మత సంరక్షణంలో మసీదు ప్రక్కన కొనవూపిరితో అర్ధనగ్నంగా పడిఉన్న దుర్గను తెల్లవారుజాము నమాజుకెళ్ళిన మస్తాన్ రక్షించుకున్నాడు. ఊహించలేని అత్యాచారానికి గురి కాబడుతూ ఎంతటి భయంకరదృశ్యాన్ని చూసిందో? 'మాటపోయింది' అన్నారు డాక్టర్లు. చేతి మీది పచ్చనిబట్టి పేరు దుర్గగా గుర్తించారు-నిపుణులు.

శక్తిస్వరూపిణి దుర్గాదేవి. ఆ అబలను ఎందుకని రక్షించలేకపోయింది? పుక్కిటిపురాణాల్లోతప్ప దేవుళ్లు ఎవర్నీ రక్షించిన దాఖలాలులేవు. పోతే దేవుణ్ణి రక్షించుకోవటంకోసం మనుషులే పరస్పరం నరుక్కుచస్తారు. వాడు కుదిరి పోయినప్పుడు లైనుమీదకుపోయి రోజులతరబడి పత్తాలేనప్పుడు, దుర్గ తట్టకూలికి పోయి పొట్టపోసుకుంటుంది.

"రివర్సుగేరులో పోవటంవల్లనే జరిగిందికదూ ప్రమాదం" వాడిచాద స్తపు పనికి నా మెకానికల్ పరిభాషని జోడిస్తూ అడిగినదానికి ఔనన్నట్టు తలూపాడు, నిర్వికారంగా.

"చూడు మస్తాన్ జేబులు కొట్టేటప్పుడైనా జేబులో పెట్టేటప్పుడైనా పట్టు బడితే దొంగే. జేబుదొంగపట్ల మనకు జాతీయ భావంఉన్నది. కులమత ప్రాంతీయ బేధాలు లేకుండా ఐక్యంగా ఒంటరిగాడిమీదపడి పోరాడుతాం. అదే జాతీయ భావంతో తిండి దొంగని లంచగొండిని, దళారీ రాజకీయవాదిని చావబాదం. అలాగైతే దేశం బాగుపడ్ను అదెట్టాకుదురుద్ది భాయ్! పోలీసుంది ఎందుకూ పిట్టల్ని కాల్చినట్టు కాల్చదూ! "

"అక్కడిదాకా ఎందుకు, ఆరోజు బీట్‌లో మా కనకరాజు హెడ్ ఉంటే నాకం కాపాడుకునేవాడుకాదూ," అన్నాడు.

అదీ నిజమే. పోలీసుల్తో వాడికెప్పుడూ పేచీలేదు. తమ డిపార్ట్‌మెంట్ వాడ్నిగానే చూసుకునేవాళ్ళు తరుచు పట్టుకుపోయి మెడికల్ రిపోర్టుతో హాస్పిటల్‌లో చేర్చి అటునుంచి లైన్‌మీదకు పంపేవాళ్ళు.

ఏ మాట కామాటే చెప్పుకోవాలి. ఇంటికింత పంపే ఏర్పాటుకూడ వాళ్ళే చేసేవారు.

ఆకురౌడీ నాగరాజుగాడి కేసుతో అదీ ఆగిపోయింది. నాగరాజునిలాగే లైను మీదకు పంపితే సరై పోయాడు. వాడు కేడీ నెంబర్ వన్. ఇస్పెషలీ ఆకు రౌడీ కావటంతో ఫీల్డులో విరోధులు కూడా ఎక్కువే. పైగా ఆసుపత్రినుంచి లైన్‌మీద పోయే డూటీలో ఉన్నాడు గనుక గేంగీని కూడగట్టుకోలేక పోయాడు.

ఎంత రౌడీ అయినా సింగిల్‌గా గేంగీతో ఎందాకని ఫైట్ చేస్తాడు. సరై పోయాడు. ఇక్కడ నారుపోసినవాళ్ళు దానికి నీరుపోసినవాళ్ళు ఎవరైతే ఉన్నారో వారేకేసును లాయించేసారు. ఆ విధంగా ఒక ఆదరువు పోయిందని ఏడపక బెడద తప్పిందని సంతోషించాడు పిచ్చిసన్నాసి. పిచ్చితనం కాకపోతే ఏంటి? మీరే చెప్పండి. చేసేపనిలో పొరపాట్లు జరక్కుండా ఉంటాయా? ఐనా అదేమంత తప్పిదమని అసలేం జరిగింది?

ఒకరోజు లైన్‌లో ఉండగా ట్రైన్‌లో ఒక కష్టమర్ తగిలాడు. మనిషి సాదాగానేవున్నా జాగ్రత్తగా వున్నాడు. ప్యాంటు జేబులో ఉన్న చేయిని ఎట్టి పరిస్థితులలోనూ బయటికి తీయకపోవటంతోనే తెలుస్తుంది- అతని జాగ్రత్త. గంటనుంచి వాచ్ చేస్తున్న మస్తాన్‌కు అప్పుడర్థమైంది. కష్టమర్‌ని ఇంకొకడు ఫాలో అవుతున్నాడని.

ఏ పనిలోనయినా పోటీ ఉండవచ్చునేమోగాని, కూలిసంఘాలలో కూడనట్టు ఇక్కడ పోటీ అసలు పనికిరాదు.

"చూడు తమ్ముడూ కష్టమర్‌ని ఎక్కడినుంచి ఫాలో అవుతున్నావు" అడిగాడు మస్తాన్.

వీడ్నీ ఏలూరులో పాతికరూపాయలకు కొన్నా అన్నాడు కోవర్కర్.

"పార్టీ పెద్దముదురు లాగుంది. లాగించేస్తావా, లాభంతీసుకుంటావా"

ఏభయి రూపాయలకు బేరంచేసుకో కేష్‌ఇచ్చి కొన్న పార్టీ, ఎంత ముదురంటే తిరుపతిపోయేవరకు చోటుపెట్టలేదు. మస్తాన్‌కు ఒక పక్క అనుమానంతో పాటు పట్టుదలా పెరిగింది.

తిరుపతి చేరేవరకు జేబులో చెయ్యి తియ్యనివాడు, సత్రంలోకివెళ్ళి వచ్చినాక కూడా జేబులో చెయ్యి వుంచుకుంటంతో అనుమానం బలపడింది. జేబులో ఏమన్నావుంటే అది సత్రంలో దాచుకు రావచ్చుగా?

ఇంకొక్క క్షణం వృధాచెయ్యదలుచుకోలేదు. డైరెక్టుగా పార్టీతోనే, "చూడు భాయ్ చాలా సేపునుంచి చూస్తున్నాను, చెయ్యిజేబులోనే వుంచుకున్నావ్. దానికేమయ్యింది?

"గేర్‌వీల్సులోపడి నలిగి పోయిందండి" అని నజ్జునజ్జుఅయి పంగలకర్రలా తయారయిన చెయ్యి చూపించాడు.

అతన్ని చూస్తే చాలాజాలివేసింది మస్తాన్‌కు. "చూడుబాబు, ప్రమాదానికి నీవేంచేస్తావ్. దాన్ని అలా దాచినందువల్ల ఇంకాప్రమాదం. నేనుకాబట్టి, సరి పోయింది అదే నాగరాజు గాడిలాంటోడెవడైనా మనిషిని సరిచేసయినా పనిచేసుకు పోవటానికే చూస్తాడ"ని చెప్పాడు.

"అలాగేనండి, మీరెవరండీ" అని అడిగినపార్టీకి-

"నిన్ను యాభయిరూపాయలకి కొన్నవాణ్ని" అని చెప్పివచ్చేసేడు మస్తాన్.

ఆ వచ్చినవాడు మూడురోజులదాక మనిషికాలా. అడవిలో వేట జీవనాధా రంగా బ్రతికేవాడు గురి కోల్పోయినంత గిజగిజలాడేడు. శిఖండిని చూసిన భీష్మాచార్యుడిలా తిరిగి లైసుమీదకు పోనని భీష్మించుకున్నాడు. వాడ్ని మార్చటం సాధ్యంకాదని తెలిసి ఆఖరి ప్రయత్నంగా చెప్పిచూసా.

"అరే భయ్యా! నీవెవ్వరికీ ద్రోహంచెయ్యలేదు. చిన్న పొరపాటు పడ్డావని వృత్తికి నీళ్ళువదులుకుంటే బ్రతుకుదెరువుమాట ఎలావున్నా వృత్తిధర్మాలేంకాను? ఎవరుచేసే పనివారు సవ్యంగా చేయటంకన్నా దేశసేవ లేదంటారే! ఒకనిర్దోషి ఉరికి కారణమైన లాయరుగాని, ఆపరేషన్ చేసి కత్తిని కడుపులో ఒదలేసి కుట్టేసిన డాక్టరుగాని, ప్రజలిచ్చిన అధికారాన్ని స్వప్రయోజనం కోసం దుర్వి నియోగం చేసి నియంతృత్వాన్ని చలాయించిన రాజకీయవాదులుగాని, నెత్తిని చెంగేసుకుని పోతున్నారా? రెట్టించి దేశసేవ చేయటంలా?"

అప్పుడు వాడు తీక్షణంగా నామొహంలోకి చూస్తూ అన్నమాటలు ఇప్పటికీ నా చెవుల్లో గింగురుమంటున్నాయి.

వాళ్ళు గొప్పవాళ్ళు, డబ్బున్నవాళ్ళు, వాళ్ళకు కావలసింది ఇంకా ఇంకా డబ్బు- మనం పేదవాళ్ళం, మనకుకూడా నీతిలేకపోతే దేశంగతి ఏం కాను!

---

సృజనకు మనియార్డరులు పంపేవారు మనియార్డరు కూపన్ మీద విడివిడి అక్షరాలలో తమ అడ్రస్ వివరంగా రాయాలి-డబ్బు ఎందుకు పంపుతున్నదీ స్పష్టంగా తెల్పాలి.

—సృజన

"గోదావరి పొరలుతోంది..." సిరిసిల్లా, జగిత్యాల
పేద రైతాంగ పోరాటాలు

# పి. యు. సి. యల్. వాస్తవ విచారణ కమిటీ నివేదిక

జవహర్లాల్ నెహ్రూ యూనివర్సిటీ అధ్యాపకుడు డా. అశ్వినీకుమార్ రే ప్రఖ్యాత పాత్రికేయుడు మోహన్‌రామ్, సుప్రీంకోర్టు వకీలు అశోక్‌పాండే ఢిల్లీయూనివర్సిటీ అధ్యాపక వర్గానికి చెందిన డాక్టర్ సుదేశ్ వైద్, సి.వి. సుబ్బారావులతో నవంబరు 1 న ఒక వాస్తవ విచారణ కమిటీని ఢిల్లీ పి.యు.సి.యల్. ఏర్పాటు చేసింది. నవంబరు 15 నుంచి ఆ కమిటీ జగిత్యాల, సిరిసిల్లా తాలూకాలలో పర్యటించింది. శాసనసభా సభ్యుల్ని, పౌరహక్కులఉద్యమ ప్రతినిధుల్ని, విద్యాలయాలకు చెందినవారినీ, పాత్రికేయుల్ని, భూస్వాముల్ని, రైతుకూలీల్ని, వుద్యోగుల్ని కలిసి మాట్లాడింది. కోర్టు పత్రాల్ని, పోలీసు పత్రాల్ని చూసింది. అనేక గ్రామాల్లో అక్కడికక్కడ పరిశీలనలు చేసింది. వీటన్నిటి పర్యవసానంగా అది తయారు చేసిన నివేదికనుబట్టి తెలిసేదేమిటంటే.

## భూస్థితిలో తీవ్రమైన వ్యత్యాసాలు

జగిత్యాల తాలూకాలో లోతనూరు గ్రామాన్ని తీసుకుంటే —

| ఎకరాలు | కుటుంబాల సంఖ్య |
|---|---|
| 200 - 300 | 1 |
| 25 - 50 | 4 |
| 10 - 25 | 20 |
| 3 - 10 | 35 |
| 3 లోపు | 60 |
| భూమిలేని వారు | 30 |
| మొత్తం | 157 |

లోతనూరు వంటివే మిగిలిన గ్రామాలూ. మద్దునూరు భూస్వామి 200 ఎకరాల ఆసామి. భూకమతాల పరిమితి చట్టం కంట్లో మట్టి గొట్టేందుకు ఉన్నది లేనట్టురాసినా, తనకు 300 ఎకరాల భూమివున్నట్టు మరొక భూస్వామి స్వయంగా చెప్పాడు.

భూమిలేని వారికి ప్రభుత్వం కేటాయించిన పొరంబోకు భూములుగాని, కేటాయించకుండా వదిలేసివున్న పొరంబోకు భూములుగాని, భూస్వాముల వాస్త

వాధీనంలోనే వుంటున్నాయి. పేదరైతాంగాన్ని భయపెట్టో లంచం పెట్టో ఎట్టాగైతేనేమి, భూస్వాములే వీటిని సొంతం చేసుకోగలిగారు.

వ్యవసాయ కార్మికులకు మగవారికైతే రోజుకి ఒక రూపాయి మొదలు 3.50 రూపాయల దాకా, ఆడవారికైతే ఇంకా తక్కువే, ముట్టజెబుతున్నారు.

వంట చెరుకు, తుని ఆకువంటి అటవీ వస్తువులనుంచి కూడా భూస్వాములు ఎంతో సంపాదించు కుంటున్నారు. అంతా అక్రమంగానే. కల్లుగీత కార్మికులు ప్రభుత్వానికి కట్టేది నెలనెలా 200 రూపాయలే గాని భూస్వామికి 1000 రూపాయలు! మరొక గ్రామంలో. భూస్వామి వీరినుంచి సాలీనా 60,000 రూపాయలు వసూలుచేసి, ప్రభుత్వానికి 20,000 మాత్రం కడుతున్నాడు. ఆబ్కారీ లైసెన్సుదారు కావడం మూలాన యీ అక్రమం సాగుతూంది. కల్లుగీత కార్మికులు సహకార సంఘాలు పెట్టుకోవడం కొందరు భూస్వాములకు గుర్రు.

మరి కొందరు భూస్వాములు పెట్రోలుపంపుల ద్వారా, సివిల్ వర్క్సు కాంట్రాక్టులద్వారా, చిన్న చిన్న పరిశ్రమల ద్వారా ఆదాయం పెంచుకుంటున్నారు. భూమి తనఖా బ్యాంకు లేమి, సహకార సంఘాలేమి, పంచాయతీ లేమి వీరి ఆధీనంలోనే నడుస్తున్నాయి. పంటకాలువలూ రోడ్డులూ వగైరా ప్రభుత్వం సమకూర్చే నదుపాయాల నుంచి కూడా "లెవీ" ల రూపంలో వీరు ఆదా తీస్తున్నారు. వూరికి రోడ్డూ కాలువా "తెచ్చాన"ని కాంట్రాక్టు చేసిన ఒక భూస్వామి వూరి జనంనుంచి 6,000 రూపాయలు వసూలు చేసుకున్నాడు. చక్కపల్లిలో రోడ్డూ వెయ్యలేదు. స్కూలూ పెట్టలేదుగాని వాటిపేరున నిధులు మాత్రం సేకరించాడు భూస్వామి. ఇవన్నీ స్వాహాయే. ధనిక రైతులు కూడా పేదరైతాంగంతో చేతులుకలుపు తున్నారంటే, భూస్వాముల దుర్మార్గమే కారణం.

ఈ ప్రాంతంలో కట్టు చాకిరీ పద్ధతీ వెట్టి చాకిరీ పద్ధతీ ఇంకా నిలిచి వున్నాయి. వ్యవసాయ కార్మికులే గాక, చాకళ్లు, మంగళ్లు, వడ్రంగులు, వగైరాలు కూడా వీటికి తలవంచ వలసి వస్తూంది. చాకళ్లు భూస్వాముల ఎద్దుబళ్ళ ముందో వెనకో కాలికొద్దీ పోవాలి - 'పయనాలు'*

---

* ప్రభుత్వాధికారులు గ్రామాలకు వస్తే వారికి సేవలు చెయ్యాలి. భూస్వాముల యిళ్లకు వెల్లవెయ్యాలి. బతుకమ్మ పండుగలో భూస్వాముల బతుకమ్మ బొమ్మలు మొయ్యాలి. సుంకరి వాళ్లపటేలు, పట్వారీల యిళ్లలో జీతం భత్యం లేని పాలేర్ల చందమే. గొల్లలు పండగ పబ్బాల్లో తమ గొర్రెల్ని వుచితంగా యిచ్చుకోవాలి. గౌండ్లు తాటిచెట్లను దొరలకు కేటాయించాలి.

పుట్టుకలైనా చావులైనా పండగలైనా పబ్బాలైనా కట్నాలనీ మామూళ్ళనీ జనం నుంచి చిన్నాపెద్దా మొత్తాలు రాబట్టుకోవడం ఆనవాయితీగా వస్తూంది. తగాదాలో తీర్పు చెప్పినా మామూలే!

భూస్వాములంటే భయ భక్తులు చూపెట్టాలి. వాళ్ళముందు పొగ తాగ కూడదు. సైకిలెక్కి పోగూడదు. చెప్పు కాళ్ళతో నడవగూడదు. మోకాలు దిగేలా ధోవతీ కట్టగూడదు. ఆడవారిని సమర్పించుకోవాలి. ఇలాంటి దురాచారా లెన్నో!

## రైతుసంఘాల కోర్కెలు

1977 మార్చి ఎన్నికల్లో కాంగ్రెసు (ఐ) - సి. పి. ఐ. ఒప్పందం ఫలితంగా, సిరిసిల్లా సీటును సి. పి. ఐ., జగిత్యాల సీటును కాంగ్రెసు (ఐ) గెలుచు కున్నాయి. సిరిసిల్లా తాలూకాలో ఒక నక్సలైటు పార్టీ నాయకత్వాన 1972 లగాయతు రైతు సంఘాలేర్పడి పనిచేస్తూ రాగా, ఎమర్జెన్సీ తర్వాత మరొక నక్సలైటు పార్టీ జగిత్యాల తాలూకాలో రైతు సంఘాలనేర్పాటు చేసింది. 1978 జూలైలో రేడికల్ యువజనసంఘాలు తలెత్తి, జగిత్యాల తాలూకా రైతు కూలీ సంఘాలను కదిలించి విస్తరింపజేయ గలిగాయి. సిరిసిల్లా తాలూకాలో రైతు మహిళాసంఘాలు కొన్ని గ్రామాల్లో ఏర్పడి వుంటున్నాయి. ఈ రెండు తాలూకాల్లోనూ సి. పి. ఐ. కి చెందిన రైతు సంఘం, వ్యవసాయ కూలి సంఘం కూడా పనిచేస్తున్నాయి. నక్సలైటు పార్టీలకు చెందిన రైతు-కూలీ సంఘాలకు సక్రమమైన నిర్మాణంలేదు. అవి ముఖ్యంగా వుద్యమాల్లాంటివే. 40-50 ఎకరాల భూస్థితిపరులు సైతం ఈ సంఘాలను బలపరచడం ఒక విశేషం. ఒకానొక కేసులో నిందితులుగా ఒక గ్రామానికి చెందిన 19 మందిలో భూమి ఏమీలేని వారు 8 మంది, అరెకరంలోపు వున్నవారు 7 గురు, అరెకరంనుంచి మూడెకరాల దాకావున్నవారు 3 గ్గురు, 40 ఎకరాల ఆసామి ఒకరు. రైతు కూలీ సంఘ సభ్యత్వం గురించి ఒక గ్రామస్తుడు చెప్పిన జవాబు— "దొర మినహా ఎవరు కారు?"

రైతులను అరెస్టు చేయిస్తానని బెదరగొట్టి ఎమర్జెన్సీ కాలంలో భూస్వాములు వసూలు చేసిన మొత్తాలు తిరిగి చెల్లించాలని, వ్యవసాయ కూలీ రేట్లు పెంచాలని, అక్రమంగా స్వాధీనపరచుకున్న ప్రభుత్వ భూముల్ని వదులుకోవాలని యీ రైతు-కూలీ సంఘాలు కోరుతున్నాయి. ఈ కోర్కెలను పెడచెవిని పెట్టిన భూస్వాములను సాంఘిక బాయికాట్ కు గురిచేయడం జరిగింది. పనిపాట్లవాళ్ళంతా కట్టుగట్టి భూస్వాముల పనులు కట్టివేశారు. 1978 జూలై నుంచి యీ పోరాటం వుధృతం కాసాగింది.

## ఉద్యమమూ దాని ఫలితాలూ

1977 సెప్టెంబరులో అప్పటి గవర్నరు శారదా ముఖర్జీ (వేములవాడ) సందర్శనం సందర్భంగా మహజరు సమర్పించేందుకు వేలాదిగా వచ్చిన రైతాంగానికీ ఒక సర్కిల్ ఇన్‌స్పెక్టరుకూ మధ్య జరిగిన గొడవ ఈ ఉద్యమంలో తొలి సంఘటన * ఆ సి. ఐ. గాయపడ్డాడట. కేసు పెట్టారు. అరెస్టు చేశారు. ఆ తర్వాత 1977 నవంబరులో సిరిసిల్లా తాలూకా రైతాంగ నాయకుడు లక్ష్మీ రాజ్యాన్ని, జగిత్యాల రైతాంగ నాయకుడు పోశెట్టిని (భూస్వాముల గూండాలు) చంపడం జరిగింది. 1978 ఏప్రిల్‌లో సిరిసిల్లా తాలూకా నగ్జలైటు నాయకుడు చలపతిరావును వేములవాడ, చక్కపల్లి భూస్వాముల గూండాలు చంపేంత పని చేశారు. దాదాపు అదే కాలంలో మద్దునూరు గ్రామ పోలీసు పటేలు ఖూనీ జరిగింది. జూన్ మాసంలో బోయనపల్లి భూస్వామి మెడలో చెప్పుల మాల వేసి రైతులు ఊరేగించారట.

సెప్టెంబరు 7న రైతుకూలీసంఘం జగిత్యాలలో బ్రహ్మాండమైన సమావేశం జరిపింది. సెప్టెంబరు 14న రేడికల్ యువజనసంఘ కార్యకర్తలు కొందరు చిన్మెటపల్లి గ్రామ రైతుకూలిసంఘాన్ని కదిలించేందుకు వెళ్ళినప్పుడు, భూస్వామి తన 'గడీ' లో వాళ్ళను అక్రమంగా నిర్బంధించాడు. జనం గడీని చుట్టుముట్టగా, భూస్వామి కాల్పులు సాగించాడు. పదకొండుమందికి గాయాలయ్యాయి. ఇరు పక్షాలవారూ పోలీసులకు ఫిర్యాదులిచ్చారు. కాని, భూస్వామిని ఏమీ చేయకుండానే, చాలా మంది రైతులను మాత్రం అరెస్టు చేశారు పోలీసులు. ఈ దురన్యాయం పరిసర గ్రామాలన్నిటా వుద్రేకాలను పెంచింది. ఆ తర్వాత షాకల్ల గ్రామంల్లో, రైతు కూలీ సంఘ నిర్మాణం కోసం వచ్చిన రేడికల్ యువజనసంఘ కార్యకర్తల్ని పోలీసులు నిర్బంధంలోకి తీసుకుని వేన్లో ఎక్కించాక, జనం పోలీసు వేన్‌ను చుట్టుముట్టి, నిర్బంధితులను విడిచి పెట్టించుకో గలిగారు. కోతనూరు గ్రామంలో భూస్వామి మీద గత 25 దినాలుగా బాయ్‌కాట్ జరుగుతూ వచ్చినప్పుడు, భూస్వామి పిలుపు మేరకు అక్కడికి కొందరు కానిస్టేబుల్సుతో వచ్చిన సబిన్‌స్పెక్టరు, భూస్వామికి పనిచెయ్యకుండా వున్న ఒక వ్యక్తి మీద చెయ్యి చేసుకున్నాడు. జనం మూగడం చూచి

---

* గవర్నరు సన్నిధిలోనే దేవాలయం ఎదుట పోలీసులు దారుణంగా లాఠీచార్జీ చేశారు. దీనికి గవర్నరు తన సంతాపం ప్రకటించటం కూడా జరిగింది. పోలీసులు మాత్రం కక్ష పెంచుకుని, ఆ మరురోజున మరీ దారుణంగా లాఠీ చార్జి చేశారు.

144 వ సెక్షన్ అమల్లో వుంది, చెదిరి పొమ్మన్నాడు. మాటలు ముదిరాయి. పోలీసులు కాల్పులకు దిగారు. ఆరుగురు గాయపడ్డారు. పోశయ్య చని పోయాడు. ఆ రాత్రే సాయుధ పోలీసులు లోతనూరు మీదికి వచ్చిపడి, ఆ భూస్వామి కుమాళ్ల సాయంతో రైతుల్ని చావగొట్టి, 43 గురిని అరెస్టు చేశారు. వెంటనే ఒక పోలీసు క్యాంపూ పెట్టారు.

అక్టోబరు 20 న ఈ రెండు తాలూకాలను "కల్లోలిత ప్రాంతాలు" గా ప్రకటిస్తూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం గెజిట్ ప్రకటన చేసింది.

## దమన కాండ

భూస్వాములు విడిగా, పోలీసులు విడిగా గాని, భూస్వాములూ పోలీసూ కలిసిగానీ రైతుల్ని కొట్టడం జరుగుతూంది. పోలీసుల సమక్షంలోనే భూస్వాముల తొత్తులు రైతాంగం మీద జబర్దస్తీ జులుం సాగిస్తున్నారు. ఇక్కడ దెబ్బలుతిన్న వారిని పోలీసు స్టేషన్లలో ఇంకోమారు కొట్టడమూ మామూలే. అరెస్టయిన వారిని 30 గంటల పర్యంతం నిర్బంధంలో వుంచుకున్నారు. ఆ తర్వాత, షరతులతో గూడిన బెయిలు దొరుకుతూంది. తప్పుడు కేసులు పెట్టి బెయిలు నిరాకరించడం కూడా జరుగుతూంది. బెయిలుకోసం హైకోర్టుదాకా వెళ్ళవలసివస్తూంది. జగిత్యాల తాలూకాలో పలుగ్రామాలకు చెందిన రైతులు తమతమ గ్రామాలకు వెళ్ళి పనిపాట్లుచేసుకు బతికే వీల్లేకుండా జగిత్యాల విడిచి వెళ్ళగూడదంటూ షరతుపెట్టి బెయిలు యివ్వడం జరిగింది. ఒక కేసులో కోర్టు ఖర్చులు 4,300 రూపాయలైతే, కోర్టు బయటిఖర్చులు 4,000 రూపాయలు–నిరు పేద రైతాంగానికి. దాదాపు 75 క్రిమినల్ కేసుల్లో 500–600 మందిని నింది తులుగా చేసి వున్నారు. ఏ కేసులోనూ ఇందాకా చార్జిషీటంటూ లేదు. చాలా కేసుల యఫ్. ఐ. ఆర్. లలో ఏ కొద్ది మందినో నిందితులుగా పేర్కొని "తది తరులు" అని విడిచిపెట్టడం, ఎవరిమీద కక్షవుంటే వారిని యీ 'తదితరులు'లో ముందు ముందు ఇరికించడానికే. నిరపరాధుల్ని కూడా భయపెట్టేందుకు యిది భూస్వాములకు సదవకాశం.

స్త్రీలమీద అత్యాచారాలు జరపడం దమనకాండ రూపాలలో ఒకటి. కొదు రుపాక గ్రామంలో, కల్లోలిత ప్రాంతాల ప్రకటన వచ్చిన తొమ్మిది రోజులకు, స్థానిక భూస్వామి గూండాలు రైతు మహిళా సంఘానికి చెందిన హరిజన స్త్రీ రాజవ్వ ఇంటిమీద పడ్డారు. రాజవ్వ భర్తనూ మామనూ మరిదినీ కొట్టి కట్టి పడేసి, ఆవిడను పొలంలోకి యీడ్చుకెళ్ళి చెరిచారు. స్పృహ కోల్పోయిన స్థితిలో తెచ్చి యింటిముందు పడేసి చక్కా వెళ్ళారు. యఫ్. ఐ. ఆర్.ను నమోదు

చేసినా, యింతవరకు పోలీసులు కదల్లేదు. మానభంగానికి భయపడి మహిళా సంఘ సభ్యులనేకులు పారిపోతున్నారు

"కల్లోలిత" ప్రాంతాలలోని గ్రామాలలో భయభీతావహ పరిస్థితి ఏర్పడి వుంది. జీపు కనిపించగానే పసిపిల్లలు పరుగుచ్చుకుంటున్నారు. రైతులు నోరు మెదపడానికే సంకోచిస్తున్నారు. చాలామంది వూళ్లు వదిలి వెళ్ళారు. రైతుకూలీ సంఘంతో సంబంధాలుంచుకోడానికే కొందరిప్పుడు భయపడుతున్నారు. రాత్రి 9 గంటల తర్వాత గ్రామస్థులు వూరు దాటిపోడానికి వీల్లేదు. పోలీసు క్యాంపులు మిక్కుటమయ్యాయి. భూస్వాముల పనులకు పోయితీరవలసిందిగా పనివాళ్లను నిర్బంధించటం ఎక్కువౌతున్నది. క్రితంలో రైతుకూలీ సంఘంతో రాజీకి దిగి రాసాగిన భూస్వాములిప్పుడు బిర్ర బిగుసుకుని కూర్చోగలుగు తున్నారు. భూస్వాములమీద వచ్చిన ఫిర్యాదులను పోలీసులు పట్టించుకోటం లేదు. ఫిర్యాదు చేసి ఫాయిదాఏమిటని షాకల్ల ప్రజలు నిస్పృహ చెందుతున్నారు. భూస్వాముల 'గడీ'లలోనో ఆచుట్టు పట్లనే పోలీసు క్యాంపులు పెడుతున్నారు? జగిత్యాలలో క్లబ్‌లోనే ఠికాణా వేశారు. పరిస్థితి వుద్రిక్తంగా వున్నా, భూస్వాముల తుపాకీ లైసెన్సులు పదిలమే. కొత్త లైసెన్సులూ అందుతున్నాయి. ఇక లైసెన్సు లేకుండానే ఎంతటెన్ని ఆయుధాలున్నాయో!

'కల్లోలిత' ప్రాంతాలుగా ప్రకటించడానికి ప్రభుత్వం చెప్పే కారణాలను పరిశీలించాలి; ఖూనీలు, డకాయితీ, గృహదహనాలు, పశువుల చోరీలు, బల వంతంగా జనంనుంచి డబ్బు పసూళ్లు, కత్తులతో తుపాకులతో జనాన్ని బెదల గొట్టడం, ప్రజల్ని దౌర్జన్యానికి ప్రేరేపించే వుపన్యాసాలు, నిషిద్ధ నాటకార ప్రదర్శన, నడిమిరకం రైతులమీద జబర్దస్తీ, బలవంతంగా, భూ ఆక్రమణ, వీటికి తోడు, "ఉగ్రవాదుల చట్ట వ్యతిరేక కార్య కలాపాలు".

"ఉగ్రవాదులు" చేసిందల్లా చట్ట వ్యతిరేకమైతే తప్ప ఈ మాటకు అర్థం పర్థం లేదు. ఇది నిర్దిష్టమైన ఆరోపణే కాదు. శాంతి భద్రతలు ఈ ప్రాంతాలలో మొత్తంగానే దెబ్బతిన్నాయా అంటే, ఈ రెండు తాలూకాల్లో 330 గ్రామాలుంటే వాటిలో 15-20 గ్రామాలలోనే వుద్యమ ప్రభావం కనిపిస్తున్నది. సాధారణ చట్టాలే యీ పరిస్థితిని అదుపులో పెట్టగలిగే వైనప్పుడు, "కల్లోలిత" ప్రాంతా లుగా ప్రకటించడం అనవసరం అని నగ్జలైటు పార్టీలకు చెందని లాయర్లు, రాజకీయ కార్యకర్తలు అంటున్నారు.

ఈ వుద్యమంతో ఎలాగో ముడి పెట్టదగిన ఖూనీలు ఒక సంవత్సరంలో మూడు మాత్రమే. వాటిలో రెండు రాజకీయ కార్యకర్తల హత్యలు, ఒకటేమో పోలీసుపటేలు హత్య. ఈ హత్యకు సంబంధించిన యఫ్. ఐ. ఆర్.లో ఏ నింది

తుదిపేరూ లేదు. మూడు నెలల తర్వాత ఆరుగురిని పేర్కొని అరెస్టు చేసి బెయిలుమీద విడిచారు. కాబట్టి రైతాంగఉద్యమానికీ ఖూనీలకూ గల సంబంధాన్ని ప్రభుత్వం నిశ్చితంగా నిరూపించవలసివుంది.

చిన్నెట్పల్లి "కల్లోలిత" ప్రాంతాలకు చెందిన గ్రామం కాదు. గృహదహనమంటూ ఏదైనావుంటే, ఆ గ్రామంలోనే. అలాగే దకాయితీ, లూటీలకు సంబంధించి ఏ కేసులోనూ చార్జిషీటు పేర్కొనడమంటూ జరగలేదు.

ఎమర్జన్సీ కాలంలో అదిరించి బెదిరించి రైతాంగంనుంచి భూస్వాములు పెద్దమొత్తాలు రాబట్టుకున్నారు. బాయ్‌కాట్‌కు జడిసి కాళ్ళబేరానికి వచ్చి ఆ సొమ్ములో కొంత చెల్లించారు. ఇది బలవంతం ఎలా అవుతుంది? రైతాంగం కత్తులూ, తుపాకులూ, వాడుతున్నారనడానికి ఆధారమే లేదు. ఉపన్యాసాల విషయానికివస్తే, ఒకటి రెండు సందర్భాల్లో (లోతనూరు, చిన్నెట్పల్లి) కార్యకర్తలు కోపోద్రిక్తులైన జనాన్ని అదుపులో వుంచారే తప్ప ఎక్కడా రెచ్చగొట్టినట్టులేదు. ఆంధ్రప్రదేశ్‌లో ఏ నాటకాలైనా నిషేధం పాలైవుంటేగదా, వాటిని ప్రదర్శిస్తున్నారనడం ?

నడిమిరకం రైతులు భూస్వాముల అక్రమ పెత్తనాన్ని సహించలేక రైతాంగంతో కలిసి ఉద్యమంలోకి వచ్చారు. రైతాంగం వారిని బెదిరించవలసిన అగత్యంలేదు.

వ్యక్తుల ప్రైవేటు భూముల ఆక్రమణకుగాకుండా, ప్రభుత్వానికి చెంది ప్రభుత్వమే కేటాయించగా భూస్వాములు అక్రమంగా స్వాధీన పరచుకున్న భూముల ఆక్రమణకే యీ ఉద్యమం. ప్రభుత్వం ప్రకటించిన కార్యక్రమాన్ని అమలుపెట్టటానికే యీ పోరాటం. దీన్నంతా "ఉగ్రవాదుల చట్టవ్యతిరేక కార్యక్రమాలు" అనటం, వాటిని అరికట్టటానికే యీ తాలూకాలను "కల్లోలిత ప్రాంతాలు" అని ప్రకటించటం, న్యాయమైన ప్రజల కోర్కెలనూ, ఉద్యమానికిగల ప్రజాబాహుళ్య స్వభావాన్నీ నిరాకరించటమే. నిజానికి, 70 మంది భూస్వాములు వెళ్ళి మొరపెట్టుకున్నాకనే, ముఖ్యమంత్రి యీ ప్రకటనకు పూనుకున్నాడని ఒక భూస్వామి అంటున్నాడు. భూస్వాములు, పోలీసు అధికారులు, ప్రభుత్వపక్షానికి చెందినవారూ సమర్థించవలసిందేగాని, అత్యధిక సంఖ్యాకులు యీ ప్రకటనను సమర్థించటంలేదు. సాంఘిక, ఆర్థిక అసమానతలే యీ ఆందోళనకు మూలమనేదే బహుజనాభిప్రాయం. కాంగ్రెస్ (ఐ)కి ఓటుచేసిన బలహీన వర్గాలే ఈ దమనకాండకు ఎక్కువగా గురికావడం గురించి ఆ పార్టీకి చెందిన ఒకానొక ముఖ్యుడే వాపోతున్నాడు. గ్రామోద్యోగులకు కూడా యీ ప్రకటన విషయంలో పూర్ణామోదంలేదు. దీనికి వాస్తవమైన ఆధారమేదీలేదు. సాయుధ పోలీసుల

ఇందిరమ్మ ఎమర్జెన్సీ
చెన్నారెడ్డి 'కల్లోలిత ప్రాంతాలు'

## ప్రకటించింది 'ఇరవై సూత్రాలు' అమలు చేయడానికే!

ఢిల్లీ పి. యు. సి. ఎల్. నిజ నిరూపణ కమిటీ సభ్యులు సిరిసిల్ల, జగిత్యాల కల్లోలిత ప్రాంతానికి వచ్చి హైదరాబాదులో రెండురోజులు వుండి రాష్ట్ర ముఖ్యమంత్రిని కలుసుకోవాలని ప్రయత్నం చేశారు. వాళ్ల ఢిల్లీనుంచి బయల్దేరిన దగ్గరినుంచీ ఈ ప్రయత్నాలు చేసారు. మొదట కలువడానికి సుముఖత చూపిన చెన్నారెడ్డిగారు ఏకారణంవల్లనో మరి చివరిక్షణాన మనసు మార్చుకున్నారు. బహుశా ఆ కమిటీకి 'గుర్తింపు' యిచ్చినట్లు అవుతుందనుకున్నాడో, తాను కలిస్తే పత్రికలూ, ప్రజలూ ఎక్కువగా పట్టించుకొని బాగా ప్రచారం అయిపోతుందనుకున్నాడో తెలియదు. కాని "వాళ్ళకేం ఏమైనా అంటారు. ఇక్కడ అసలు తమాషా మేం ఎదుర్కొంటున్నాం ('we are facing the music') అని దాచుకోకుండా కడుపులోని నిజం కక్కకా తప్పలేదాయనకు. మరో చెంపన పత్రికలూ, ప్రజలూ ఆ రిపోర్టును బాగా పట్టించుకున్నాయి. ముప్పది సంవత్సరాలలో 'కల్లోలిత ప్రాంతాల' చట్టం అమలులోవున్నా మొదటిసారిగా సుప్రీం కోర్టులో దీనిని సవాల్ చేయాలన్న ఆలోచనకూడా పియుసిఎల్‌కు వచ్చింది. ఈ కమిటీ రిపోర్టును విడుదలచేస్తూ ఢిల్లీ పత్రికా విలేఖరుల సమావేశంలో ఢిల్లీ పియుసిఎల్ అధ్యక్షుడు గోవింధ ముఖోటియా ఈవిషయాన్ని ప్రకటించాడుకూడా.

పైకి సూటిగా నిజనిరూపణకమిటీ రిపోర్టుకు సమాధానం అని చెప్పకున్నా రాష్ట్రప్రభుత్వం మళ్ళీ ఒకసారి 'కల్లోలిత ప్రాంతాలుగా' సిరిసిల్లా, జగిత్యాలను ఎందుకు ప్రకటించిందో కారణాలు చెప్పుకున్నది. అక్టోబర్ 20న ఈ రెండు తాలూకాలను 'కల్లోలిత ప్రాంతాలు'గా ప్రకటిస్తూ ఏ ప్రకటన విడుదల చేసిందో దాదాపు దాన్నే చర్వితచరణం చేసింది. ఈతాలూకాల్లో నక్సలైట్లు ముప్పై హింసాచర్యలు చేశారని, వాటిలో హత్యలు, దోపిడీలు, మధ్యతరగతి రైతులను డబ్బుకొరకు బెదిరించడం వగయిరా పేర్కొన్నారు. జగిత్యాల, సిరిసిల్ల కోర్టులలోగానీ, కరీంనగర్ సెషన్స్ కోర్టులోగానీ 'నక్సలైట్ల'పై ఒక్క హత్యానేరం

---

దమనకాండకు మాత్రమే ఇది పరాకాష్ఠ. భూస్వాముల కొమ్ముగాచేందుకే ఈ ప్రకటన. ఎమర్జెన్సీ రోజుల్లోకంటే యిప్పుడే ప్రభుత్వ అధికారులకు విపరీతాధికారాలు చేజిక్కాయి. అప్పట్లోకంటే యిప్పుడే బలహీన వర్గాల ప్రయోజనాలకు ఎక్కువ దెబ్బ. అసలే యీ వ్యవస్థలో వుంటూన్న అసమానతలను యిది తీవ్రతరం చేసితీరుతుంది. చట్టం ఎవరినైతే నిజంగా ఆదుకోవాలో వారినే అణిచివేస్తుంది.

కూడ పోలీసులు మోపలేకపోయారన్నది ఆ మూడు కోర్టులకు సంబంధించిన క్రిమినల్ కేసుల రికార్డులన్నీ చూసిన నిజనిరూపణ కమిటీ ఆధారాలతోసహా మన ముందుంచింది. 'కల్లోలిత ప్రాంతాల' ప్రకటన సందర్భంగా పేర్కొన్న మద్దునూరు పోలీసుపటేల్ హత్యకేసుకూడ జగిత్యాల కోర్టులో నక్సలైట్లపై కేసుగా నమోదు చేయబడలేదు. ఇద్దరు రైతుకూలీ కార్యకర్తలు లక్ష్మీరాజ్యం, పోశెట్టిలను భూస్వాములు దారికాచి చంపారు. లొత్తునూరులో పోచయ్యను పోలీసులుదారికాచి చంపారు. చినమెట్‌పల్లిలో భూస్వామి రైతులపై కాల్పులు జరిపాడు. గుమ్మలూరులో స్త్రీలపై పోలీసులు లాఠీచార్జ్ జరిపారు. జనాన్ని చెదరగొట్టడానికి కాల్పులు జరిపారు. ఈవిషయం కరీంనగర్ ఎస్పీ స్వయంగా అంగీకరించాడు. కుదురుపాకలో భూస్వామి గుండాలు, సిరిసిల్లలో భూస్వామిస్వయంగా స్త్రీలను చెరిచారు. కనీసం నలుగురు స్త్రీలు భూస్వాముల చేతుల్లో మానభంగం చేయబడో, మానరక్షణకోసమో ప్రాణాలు కోల్పోయారు.

తాను చేస్తున్న అభియోగాలకుగానీ ఆరోపణలకుకానీ ఒక్క ఉదాహరణ కూడా ప్రభుత్వం ఇవ్వలేకపోతున్నది. అస్పష్టమైన, ఆధారరహితమైన ఆరోపణలు మాత్రం మళ్ళీ మళ్ళీ నెత్తిన నోరుపెట్టుకొని చేస్తున్నది.

అయితే అన్నిటికన్నా పెద్ద విచిత్రమేమిటంటే సిరిసిల్ల, జగిత్యాల తాలూకాల్లో ఏ ముప్పై కేసులయితే నక్సలైట్లకు సంబంధించినవని ప్రభుత్వం ప్రకటించిందో, వాటికీ, నక్సలైట్లకూ సంబంధంలేదని కరీంనగర్ పోలీసు సూపరింటెండెంట్ స్వయంగా ప్రకటించాడు (డిసెంబర్ 8). ఈ ప్రకటన చాల వివరంగా అన్ని పత్రికల్లోనూ వచ్చింది. మచ్చుకు రెండు ఉదాహరణలు :- జగిత్యాల తాలూకా జైనగ్రామంలో ఒక వర్తకులయింట్లో దోపిడీ జరిగితే అది నక్సలైట్ల చర్యగా పోలీసులు వెంటనే ప్రకటించారు. అట్లే కుదురుపాక గ్రామంలో కొందరి ఇళ్ళపై దాడి జరిగితే అదికూడ నక్సలైట్లచర్యగా ప్రకటించారు. కాని ఈరెంటికీ నక్సలైట్లకూ ఏమీ సంబంధంలేదని కరీంనగర్ ఎస్పీ శ్రీ సుకుమారన్ ప్రత్యేకంగా పేర్కొన్నాడు.

కాబట్టి స్థానిక ప్రజలు, పార్టీలు మాత్రమేకాదు, చివరకు జిల్లా పోలీసు అధికార్లనుకూడా సంప్రదించకుండా, బహుశా వాళ్ళ అభిప్రాయాలను ఖాతరు చేయకుండా తనవద్దకువచ్చి మొర పెట్టుకున్న భూస్వాముల కోరికమేరకు మాత్రమే జగిత్యాల, సిరిసిల్లాలను చెన్నారెడ్డిగారు 'కల్లోలితప్రాంతాలు'గా ప్రకటించారన్నది మరింత స్పష్టమవుతున్నది.

నక్సలైట్లు ఇరవైసూత్రాల ప్రణాళికను అమలు చేయడానికి అడ్డుపడుతున్నారని ఇంకొక ఆరోపణ.

నిజమే మరి! ఇందిరమ్మకూ పేదలకు ఇరవై సూత్రాలు అమలు చేయడానికి ఎమర్జెన్సీ ప్రకటించాల్సివచ్చింది. ఇందిరమ్మకు ఆనాటి బంటైన వెంగళరావుకూ తూర్పు గోదావరిజిల్లాలో ఇరవై సూత్రాలు అమలుచేయడానికి ఎమర్జెన్సీ కూడా చాలక 76లో ఆజిల్లాలో కొన్ని ప్రాంతాలను 'కల్లోలిత ప్రాంతాలు'గా ప్రకటించాల్సి వచ్చింది. ఇందిరమ్మను గద్దెదించి ఎమర్జెన్సీ ఎత్తివేసినాక ఇంకా ఇరవైసూత్రాలు అమలుచేయాలంటే పేదప్రజలపై ప్రేమవున్న ఏ ముఖ్యమంత్రికైనా 'కల్లోలితప్రాంతాలు'గా ప్రకటించకుండా సాధ్యమవుతుందా? వేయికి పైగా పేదరైతుల్ని కేసుల్లో ఇరికించి, జైళ్ళకు పంపిస్తే తప్ప వాళ్ళకి తమపై ప్రభుత్వానికెంత ప్రేమవుందో తెలిసేట్లులేదు!

భూస్వాముల చేతులకు తుపాకులిచ్చి ఆత్మరక్షణ పేరుతో అక్రమార్జిత రక్షణకోసం కాల్పులు జరిపించి, పోలీసు కాల్పులు జరిపి, పోలీసు క్యాంపులు పెట్టి, హరిజనస్త్రీలను చెరచి- ఇరవై సూత్రాలను అమలుచేయడానికి దీక్షగా కృషి చేసింది ఇందిరాకాంగ్రెస్ ప్రభుత్వం రాష్ట్రంలో. వీటన్నిటినీ ప్రతిఘటించమని ప్రజలకు చెప్పి "ఇరవై సూత్రాల" అమలుకు అడ్డుపడ్డారు నక్సలైట్లు. ఇరవై సూత్రాల అమలుకు అడ్డమొచ్చే దేన్నయినా నేలమట్టంచేసే టర్క్‌మన్‌గేట్. గరీబీ హటావో వారసులు నక్సలైట్లను నాశనం చేయడానికి 'కంకణం కట్టుకొని' 'కల్లోలిత ప్రాంతాల' ప్రకటన చేసారు.

కనుక ఢిల్లీ పి యు సి ఎల్ నిజనిరూపణ కమిటీ ఏంచూసినా, ఏంవిన్నా ఏంచెప్పినా, కరీంనగర్ ఎస్పీ స్వయంగా ఏం ప్రకటించినా చెన్నారెడ్డి 'కల్లోలిత ప్రాంతాల' ప్రకటన చేసింది మాత్రం ఇరవై సూత్రాలను అమలు చేయటానికే. ఇందిరమ్మ ఈనాటికీ ఎమర్జెన్సీ ప్రకటన సబబేనని సమర్థించు కొంటున్నట్లు, కరీంనగర్ ప్రజలు, పార్టీలు, చివరకు పోలీసు అధికారులు ఏం చెప్పినా ఆయన కట్టుకున్న కంకణం విప్పడు. ఆయన ప్రకటన బేసబబని ఒప్పడు. ఎందుకంటే ఇంతకన్నా రెండాకులు ఎక్కువేచదివాడు చెన్నారెడ్డి.

---

## సృజన పాఠకులకు విజ్ఞప్తి

ఈ క్రింద తెల్పిన సృజన పాత సంచికలు సృజన పాఠకులెవరి దగ్గరయినా వుంటే దయచేసి 'సృజన'కు పంపవలసిందిగా కోరుతున్నాం —వాటి వెలకు కొంటాము.

సృజన - నెంబర్లు : **2, 3, 4, 5, 6, 7, 8. 15, 59, 63, 64, 67**

—**సృజన**

ప్రమాదంలో కూడ విమానం ప్రదర్శించిన వర్గ దృక్పథం :

# ముఖ్యమంత్రి-గడ్డిపోచలు

## (An elegy on gross-cutters)

ఈ కమ్యూనిస్టులకు ఏం పనిలేదు. ప్రతిదీ రంగుకళ్ళద్దాలు పెట్టుకొని చూస్తారు. వీళ్ళకు ప్రతి దాంట్లోనూ వర్గ వైషమ్యాలు, వర్గపోరాటాలు కనిపిస్తాయి. చివరకు కుళాయిలో వచ్చే నీళ్ళకు కూడ వర్గదృష్టి వుంటుందంటారు వీళ్ళు-అని కొందరు దెప్పి పొడవచ్చు. కుళాయిలకు, కుళాయిల్లో వచ్చే నీళ్ళకు కూడ వర్గ తేడాల పట్టింపు ఎలావుంటాయో మా విరసం పోతరాజు చెప్పాడు. విజయవాడ అజిత్‌నగర్‌లో వుంటాడు గనుక ఆయనకు ఆ మునిసిపాలిటీ పక్షపాతం అనుభవైకవేద్యం. పరిశోధనకు, శాస్త్రీయసత్యాల అన్వేషణకు వర్గదృష్టి లేదంటాడు చేకూరి రామారావు. కేన్సర్‌కు మందు కనిపెట్టడానికి చంద్రమండల యాత్రకు వర్గప్రయోజనం లేదా అంటానునేను. విజ్ఞాన శాస్త్రానికి, కాకపోతే విజ్ఞానానికి వర్గదృష్టి లేదన్నదే కుటుంబరావుగారి అభిప్రాయం కూడ. కాని అది ఇవాళ సామ్రాజ్యవాదుల చేతుల్లోని పనిముట్టు, కనుక వాళ్ళకు పబ్బంగడుతున్నది. పనులుచేసి పెడుతున్నది.

అందుకే డిసెంబర్ 16న హైదరాబాదు బేగంపేట విమానాశ్రయం నుంచి ముఖ్యమంత్రిని, మరికొందరు 'ముఖ్యుల' ను ఎక్కించుకొని గగనంలోకి ఎగిరిన విమానం మంటలంటుకొని కూలినపుడు ఎవరు బతికి పోయారో, ఎవరిని ఎవరు కాపాడారో, ఎవరు బలియై పోయారో పత్రికల్లో వార్త చదివినప్పుడు-దీని తస్సాదియ్యా ప్రమాదంలో కూడ విమానం వర్గదృక్పథం ప్రదర్శించకుండా మానలేదే అనిపించింది. ఒక భయంకరమైన తుఫానుకు నావ గురియైనపుడు ఏఒక్కరికో లైఫ్ బెల్టు లభించి బతికించే అవకాశం వుంటే ఆనావలో అందరికన్నా విలువయిన ప్రాణం గలవాణ్ణి, ఎక్కువకాలం బతకవలసిన వాణ్ణి ఎంచుకొని వానికా లైఫ్ బెల్టు ఇస్తారు. (ఇవ్వాలి). ఈవిలువైన ప్రాణాన్ని ఎవరు విలువకట్టాలి ? దీనికి కొలమానం ఏమిటి ? ఎవరి ప్రాణం వారికే తీపికాదా ? ఎవరి ప్రాణం ఇంకొకనికి తీపి ? ఇలాంటి సవాలక్ష ప్రశ్నలకు జవాబు నిర్ణయించేది వ్యవస్థ: ఆ వ్యవస్థ రూపొందించుకునే విలువలు.

ఈ వ్యవస్థకు ప్రమాదకరంగా కనిపించే ప్రజలను వందలాది మందిని పట్టుకొని పిట్టల్లా కాల్పించిన పోలీసు అధికారికి, ఈ 'ఎన్ కౌంటర్ల' రహస్యాన్ని ఛేదించయత్నించిన న్యాయస్థానం నోరునొక్కిన వ్యవస్థాధిపతిని తన ప్రాణాలొడ్డియైనా కాపాడాలనిపించడం చాల సహజం. అందుకే విమాన ప్రమాదంలో మొట్టమొదట బయటికి దూకి బతికినవాడు ముఖ్యమంత్రి. బతకడానికి చేయూతనిచ్చినవాడు ఐజిపి. ముఖ్యమంత్రి ఈ భూస్వామ్య వ్యవస్థకు ముద్దుబిడ్డ-ఈవ్యవస్థ ఎంచుకున్న 'అరచేత వైకుంఠం'. ఆయన ఈవ్యవస్థకు

నోరు. మరి పోలీసులు ఈ వ్యవస్థకు కళ్ళూ చెవులా. అందుకే ముఖ్యమంత్రి గండం తప్పినందుకు, రెండో జన్మ ఎత్తినందుకు, గుళ్ళల్లో పూజలు చేయించారు. మసీదుల్లో నమాజులు చేయించారు. చర్చిల్లో ప్రార్థనలు చేయించారు. ముఖ్యమంత్రికి దైవభక్తీ, సాయిభక్తీ యినుమడించింది. 'అభ్యుదయ' పాఠశాలల్లో గంటలు గణగణ మోగాయి.

ఎందరో పెద్దలు ముఖ్యమంత్రినీ, ఐ జి పి నీ వారుబుతీరి, రోజులతరబడి అదేపనిగా అభినందించారు. (ఇదే ప్రమాదంలో బతికి బయటపడ్డ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శిని ఎవ్వరూ అభినందించినట్లు పత్రికలు రాయలేదు. ఈ వ్యవస్థలో పోలీసు చేతిలోని లాఠీకివున్న ప్రతిష్ఠ రాష్ట్ర ప్రభుత్వ హెడ్డుగుమస్తా తలకాయకు లేదని స్పష్టమే కదా)

ఈ బొమ్మకు ఇంకో బొరుసు వున్నది. విమానం కూలినచోట గడ్డి కోసుకుంటున్న పిల్లలెవరో చనిపోయారు విమానంలో ప్రయాణంచేసేవాళ్ళు ఎవరూ విమానానికి మంటలు అంటుకుంటే చావలేదు. ఈ నేలతల్లి వొడితప్ప, ఆకాశం కప్పు తప్ప దిక్కులేని, పేరులేని, ఊరులేని, జనాభా లెక్కల్లో, (ఓటర్ల జాబితా సరేసరి మరే లెక్కల్లో చోటులేని, లెక్కలు తప్పనోరు లేని, జానెడు కడుపుకు చారెడు గింజలు దొరకని అనామక జీవాలు ఆ ప్రమాదానికి బలైపోయాయి. ఆవార్త ప్రకటించిన పత్రికలుకాని, అవి చదివిన పాఠకులుగాని, తమ విమానం కూలిపోయి కాలిపోతే, దాని కిందపడి నలిగిన పిల్లల అతీ, గతీ ఆ ముఖ్యమంత్రి కనుక్కున్నాడా లేదా, పౌర రక్షక భటాధికారి ముఖ్యమంత్రి రక్షణ తప్ప నోరులేని పౌరుల రక్షణ సంగతి ఆలోచించడాలని అడిగారు? నోరున్న మనం కూడ నోరున్నవాళ్ళ ప్రాణాల గురించే ఆలోచిద్దామా-ఆందోళన చేద్దామా? విమాన ప్రమాదంలో మరణించిన విమాన ప్రయాణీకులకు లక్షరూపాయల నష్టపరిహారం ఇస్తారు. (భద్ర గజం, మోహన కుమార మంగళం బతికినా లక్షవిలువా, చచ్చినా లక్షవిలువే) విమాన ప్రమాదంలో చచ్చిన గడ్డికోత పిల్లలకో మరి! వాళ్ళపేర్లు, ఊర్లు, తలిదండ్రుల ఆరా ఎవరైనా తీసారా? వాళ్ళ కుటుంబాలకు నష్టపరిహారాలు ఇచ్చారా?

నాకు మాత్రం **An elegy on stray dog** అని గోల్డ్‌స్మిత్ రాసినటుగా కాలిపోయి కూలిపోతున్న ఈ గాలి మోటర్ల వ్యవస్థ తనకుతాను రక్షించుకునే ప్రయత్నంలో బలిపెడుతున్న అనామక, అగణిత గడ్డికోత పిల్లలపై పిల్ల తెమ్మెరల కన్నీళ్ళ పిల్లనగ్రోవులు కాకుండా ప్రతిఘటన ప్రజా ప్రభంజనాలు వీచాలని కోపంగా వున్నది, కసిగావున్నది. —వరవరరావు [గడ్డికోత పిల్లల ప్రాణాలగురించి ఏం చేయలేమా అని ఆలోచిస్తున్న కన్నభిరాన్ కు కృతజ్ఞతలతో]

సినిమా :

# "ఆలోచనలకు సంకెళ్లు"

## (Prisoners of Conscience)

భారత దేశంలో రాజకీయ ఖైదీలపై నిర్మించబడ్డ ఆనంద్ పట్వర్ధన్ నలభై నిముషాల డాక్యుమెంటరీ "ఆలోచనలకు సంకెళ్ళు" (Prisoners of cons i nce) రాజకీయ ఖైదీల పట్ల ప్రభుత్వ నిర్లక్ష్య వైఖరిని, జైళ్ళలో పోలీసుల చిత్ర హింసలను పాశవిక చర్యలను కళ్ళకు కట్టినట్టు చూపించి పౌర హక్కుల ఉద్యమ ఆవశ్యకతను నొక్కి చెప్తుంది.

ఈ చిత్రం ఢిల్లీ చాందినీ చౌక్‌లో ఒక సంఘటనతో మొదలవుతుంది. గట్టిగా నినాదాలిస్తున్న ఒక యువకుడిని పోలీసులు బలవంతంగా వ్యానులోకి ఎక్కిస్తుంటారు. అతని ఆక్రందన లాఠీ దెబ్బలతో నిరోధించబడుతుంది. తరువాత ఇందిరా గాంధీకి వ్యతిరేకంగా నినాదాలిస్తున్న గుంపువైపు కెమెరా ఫోకస్ చేయబడుతుంది. అవి 1975 మధ్య కాలంలో వేలాది మంది ప్రజలను అరెస్టు చేస్తున్న అత్యవసర పరిస్థితి రోజులు.

అరెస్టులు ప్రత్యేకమైన పార్టీకే పరిమితం కాలేదు. ఈ చిత్రం ఏ రాజకీయ పంథాను సమర్థించలేదు. దర్శకుడు వివిధ పార్టీల రాజకీయ ఖైదీలను ఇంటర్వ్యూ చేస్తే వాళ్ళ అనుభవాలు చెప్పారు. అతడు విద్యార్థులు, మధ్య తరగతి మేధావులు, పత్రికా రచయితలు, రైతులు, మార్క్సిస్టు-లెనినిస్టు, సోషలిస్టు పార్టీల వారితో మాట్లాడాడు. విద్యుత్తు అంటే తెలియని గ్రామాలున్న బీహారు జైల్లో ఖైదీలను కరెంటుతో చిత్ర హింసలు చేసారని, పిచ్చివాళ్ళకు, జైలు నుంచి పారిపోవడానికి ప్రయత్నించిన వాళ్ళకు మాత్రమే సంకెళ్ళు వేయాలని జైలు నిబంధనల్లో ఉన్నా నక్సలైట్లని అనుమానింపబడ్డ ఖైదీలకు కూడా రాత్రింబగళ్ళు ఐదు సంవత్సరాల వరకు సంకెళ్ళు వేసి వుంచారని", మేరీ టేలర్ జైలులో తను ఉన్నప్పటి పరిస్థితి వివరించింది.

ఎమర్జెన్సీ కాలమంతా నిర్బంధించబడిన ఆంధ్రప్రదేశ్ విప్లవ రచయితల సంఘం సభ్యుడు సుబ్బారావు 1 వ డిసెంబర్ 1975 న మొట్టమొదటిసారిగా 'స్వతంత్ర' భారత దేశంలో 'చట్టబద్ధం' గా రాజకీయ ఖైదీలైన భూమయ్య కిష్టాగౌడ్‌లను ఉరి తీసిన విషయం చెప్తారు. వాళ్ళను ఉరితీస్తారన్న విషయం తోటి వారికి 24 గంటల ముందు మాత్రమే తెలుస్తుంది. ఆ రాత్రి జైలంతా ఖైదీల పాటలతో దద్దరిల్లిపోయింది. భూమయ్య, కిష్టాగౌడ్‌లను ఉరితీసిన పాశవిక చర్యను దర్శకుడు స్కెచెస్ ద్వారా చూపుతాడు. అక్కడి నుంచి కెమెరా 1977 రిపబ్లిక్‌డే పరేడ్‌కు మారుతుంది. "సారే జహాసే అచ్చా" అనే పాట పాడుకుంటూ కవాతు చేస్తున్న దృశ్యం నుంచి ఇందిరా గాంధీ తనను చూడడానికి వచ్చినతనితో బాతాఖానీ చేస్తున్న దృశ్యంతో ఆగిపోతుంది.

దేశమంతా పౌరహక్కుల సంఘాలు ఏర్పడాలని, ప్రజలంతా ప్రభుత్వం చేస్తున్న వాగ్దానాలను నిలబెట్టుకొనేట్టు చేయడానికి అప్రమత్తతతో ఉండాల్సిన అవసరాన్ని జయప్రకాశ్ నారాయణ్ నొక్కి చెప్పాడు. మిద్నపూర్ జైలు ఖైదీలచే రాయబడ్డ పాట తెర వెనుక వినపస్తుండగా పౌర హక్కుల సంఘం ఊరేగింపుగా రాజకీయ ఖైదీలను విడుదల చేయాలని డిమాండ్ చేస్తూ వస్తుంది.

పట్వర్థన్ రాజకీయ ఖైదీలకు, దేశ సాంఘిక నిర్మాణానికి గల సంబంధాలను చూపెడ్తాడు. రాజకీయ ఖైదీలు అత్యవసర పరిస్థితిలో మాత్రమే ఉన్నారని కాదు. 26 జూన్ 1975 కన్న ముందూ వున్నారు. ఈ రోజు వరకూ ఉన్నారని ఈ చిత్రం చూపుతుంది.

అత్యవసర పరిస్థితిలో అరెస్టులు, చిత్రహింసలు, ఇంకా "ఎదురు కాల్పులు" ముఖ్యంగా అతివాద వామపక్ష రాజకీయాల వారి పట్ల జరిగాయి.

ప్రజా క్షేమం కోసమై, ప్రజాతంత్ర హక్కుల పరిరక్షణ కొరకై కంకణం కట్టుకొని, కష్ట నష్టాలకోర్చి ఈ సినిమా నిర్మించాడు ఆనంద్ పట్వర్థన్. "ఈ సినిమా మధ్యతరతి వాళ్ళ కోసం నిర్మించాను. ఎందుకంటే వాళ్ళ సామర్థ్యం ప్రభుత్వ విధానాన్ని ప్రభావితం చేస్తుందని నాకు విశ్వాసం వుంది" అన్నాడు ఆనంద్ పట్వర్థన్.

* * *

## ఎమర్జెన్సీపై మరో చిత్రాన్ని కేంద్ర ప్రభుత్వం నిషేధించింది

బొంబాయికి చెందిన శ్రీమతి సాయి పరంజపే నిర్మించిన ఒక డాక్యుమెంటరీ చిత్రానికి ప్రదర్శన అనుమతి యివ్వడానికి కేంద్ర సమాచార మంత్రిత్వ శాఖ నిరాకరించింది. ఆ చిత్రంలో ఎమర్జెన్సీలో జరిగిన దారుణాలు, రాజకీయ ఖైదీలపై చిత్రహింసలు చిత్రించబడ్డాయి. ముఖ్యంగా రాజన్ ఉదంతం చిత్రీకరించబడింది. ఈ డాక్యుమెంటరీని చూసిన ఒకరిద్దరు కేంద్ర మంత్రులు ఎంతో ప్రశంసించారు. సెన్సార్ అభ్యంతరాలు కూడ ఏమీ లేవు. కాని 'చాల ఆలస్యం అయింది' (అవుట్ డేటెడ్) అని చెప్పి కేంద్ర సమాచార మంత్రిత్వ శాఖ దీని ప్రదర్శనకు అనుమతి నిరాకరించింది!

నిజమే, ఎమర్జెన్సీపై, ఎమర్జెన్సీ దారుణాలపై సినిమా తీయడానికి ఆలస్యమే అయింది. కాని ఎమర్జెన్సీ ముందు నుంచీ జైళ్ళలో వుంటున్న రాజకీయ ఖయిదీల విడుదల విషయంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చేస్తున్న ఆలస్యం, ఆడుతున్న అబద్ధాల మాటేమిటి ?

# గాంధీ ఎవరివాడు?

మన దేశంలో బ్రిటిష్ పాలకులకు వ్యతిరేకంగా పోరాటం జరుగుతున్న రోజులువి.

జాతీయోద్యమంలో అతివాదం, కమ్యూనిజం పై చేయిగా వున్నప్పుడల్లా ప్రభుత్వం మితవాదుల్ని ప్రోత్సహించింది. కమ్యూనిజం విదేశీభూతమని ప్రజలు భయపడాలని ఎత్తులువేసింది. ఠాకూర్‌దాస్, బిర్లా, చమన్‌లాల్, మోడి, తైర్‌సీ, శ్రీనివాస అయ్యంగార్, లజపతిరాయ్, మోతిలాల్ మొదలైన వాళ్ళతో ప్రభుత్వ అధికారులు రోజూ మంతనాలు జరుపుతూ, బ్రిటిష్ వలసపాలన కన్న కమ్యూనిజమే మనదేశానికి ఎక్కువ హానిచేస్తుందని చెప్తూవచ్చారు. 'అలగాజనం' వల్ల ప్రమాదం దినదినం ఎక్కువవుతున్నదని భయపెట్టారు.

వ్యాపారరంగంలో ప్రముఖులైన బిర్లా, జహంగీర్, వాల్‌చంద్ హీరా చంద్, జమునాదాస్ మెహతా, దొరాబ్ టాటా, పురుషోత్తమదాస్ ఠాకూర్‌దాస్‌లు బ్రిటిష్ వారిని "మనదేశపు స్నేహితులు" అనడమేకాదు, ఈ "స్నేహితులు కమ్యూనిజంను కాలరాయడంలోనే ఎక్కువ శ్రద్ధ తీసుకోవా''లని కోరుకున్నారు. ఈ విషయంలో బ్రిటిష్ పాలకులకు సహాయం చేయడానికి సిద్ధపడ్డారు. గాంధీ మీద ఆశలు పెట్టుకున్నారు. కమ్యూనిస్టులకూ, కాంగ్రెస్‌లోని అతివాదులకూ ప్రత్యామ్నాయంగా "మహాత్మా" గాంధీని బ్రిటిష్ అధికారులకు అమ్ముకోవ డానికి ప్రయత్నం చేసారు. "కాంగ్రెస్‌లోని తిరుగుబాటుదారులను కంట్రోల్ చేయలేక పోతున్నా"రని 1930 మే లో గాంధీని ప్రభుత్వం అరెస్ట్ చేసినపుడు వీళ్ళు అభ్యంతరం చెప్పారు. గాంధీ జైలుబయట వుండి కాంగ్రెస్ నాయకత్వం చేపడితేనే బ్రిటిష్ పాలకులకు ఎక్కువ లాభమని ఠాకూర్‌దాస్ ఇర్విన్‌కు రాసిన ఉత్తరంలో తెలియజేసాడు. "కాంగ్రెస్ వుంటేనే మనం శ్వాస తీసుకోగల"మని ఠాకూర్‌దాస్ రాసాడు. గాంధీ విడుదల చేయబడ్డాడు, గాంధీ-యిర్విన్ ఒడం బడికపై సంతకం చేసాడు, యింగ్లాండ్ పోయిరాగానే అరెస్ట్ చేయబడ్డాడు. ప్రజాఉద్యమం చల్లారిపోయింది.

మళ్ళీ కమ్యూనిజం కార్మికరంగంలో కనిపించగానే బిర్లా భయపడ్డాడు. "గాంధీజీ కాని, ఆయనలాంటివారు కాని, ఒక్క భారతదేశానికి మాత్రమే స్నేహితులుకారు, బ్రిటిష్ దేశానికికూడా. శాంతి భద్రతలను నెలకొల్పడంలో గాంధీని బాగా వాడుకోవచ్చు. భారతదేశంలో వామపక్షాన్ని అదుపులో పెట్ట డానికి ఆయనొక్కడే పనికివస్తాడు"- అని బిర్లా హోమ్ మంత్రి సామ్యూల్ హోర్‌కు 14-3-32 న (ఒక వుత్తరంలో) రాసాడు. "గాంధీ పట్ల ప్రభుత్వానికి

శ్రద్ధ పెరుగుతున్న"దని బిర్లా ఆ తరువాత 3-8-34 న పురుషోత్తం ఠాకూర్ దాస్‌కు రాసిన వుత్తరంలో తెలిపాడు. కాంగ్రెస్‌పైవున్న నిషేధాన్ని జూన్ 1934 లో తొలగించి, జూలై 1934లో భారత కమ్యూనిస్టుపార్టీనీ, దాని అన్ని అనుబంధ సంఘాలనూ ప్రభుత్వం నిషేధించింది.

మన దేశంలోని సోషలిస్టు వుద్యమంపై దెబ్బతీయడానికి గాంధీ ఎంతో తెలివిగా ప్రయత్నం చేసాడు. మీరట్ కుట్ర కేసులో యిరికించబడ్డవాళ్ళు "తమ రక్షణకోసం విచారింపపద్దు. జైలు శిక్షపడితే వాళ్ళు ఆ శిక్షను అనుభవించాలి, కాంగ్రెస్ వీళ్ళకోసం లాయర్లను పెట్టదు" అని గాంధీ 'నవజీవన్' పత్రికలో రాసాడు. అంతకు రెండువారాలముందు (1929 ఏప్రిల్ 11 న) చౌపట్టిబీచ్‌లో వుపన్యసిస్తూ "హింసాత్మక చర్యలకు పూనుకున్నవాళ్ళను జైలు నుంచి విడుదలచేయాలని కోరడం మన ధర్మానికీ, మతానికీ విరుద్ధం"- అని గాంధీ అన్నాడు

సోషలిస్టు వుద్యమానికే కాకుండా, జాతీయోద్యమానికి సైతం ఎంతో హాని కలిగించే మీరట్ కుట్రకేసు విషయంలో గాంధీ ఏమీపట్టించుకోలేదు. ఈ కేసులో యిరికించబడ్డ ముప్పయిముగ్గురు నాయకుల్లో ఏడుగురు అఖిలభారత కాంగ్రెస్ కమిటీ సభ్యులు అయినప్పటికీ గాంధీకి పట్టిరాలేదు. "నిజాయితీపరుడైనకార్యకర్త ఎవరైనాసరే యిట్లాంటిసమయంలో మౌనం వహించడం ధర్మం" అని తన మౌనాన్ని సమర్థించుకున్నాడుకూడా. అక్టోబరు 1929 లో మీరట్ జిల్లాలో పర్యటిస్తున్నప్పుడు గాంధీకి రు. 36,400ల నిధి నిచ్చారు. పస్తులు పడుకున్న బొంబాయిమిల్లు కార్మికుల భార్యా పిల్లల కోసమైనా ఈ డబ్బును ఖర్చు చేయనని గాంధీ మీరట్ కేసు నిందితులతో చెప్పాడు. ఇక్కడ గాంధీ తన సహచరులను ఎట్లా వంచించి శత్రువులకు తోడ్పడ్డాడో స్పష్టమైంది. ఈ నిందితుల రక్షణకోసం కాంగ్రెస్ ఆ తరువాత యిచ్చిన ముష్టి రు. 1,500లతో ఈ మోసపూరిత చర్య తుడిచిపెట్టుకపోదు.

"కాంగ్రెస్ నాయకత్వం సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంకాదు; వ్యతిరేకమైనట్టయితే మీరట్ కేసును చూపి సామ్రాజ్యవాదాన్ని ఎదిరించే అన్నిశక్తుల ఐక్యతకోసం కాంగ్రెస్ నాయకత్వం ప్రయత్నం చేసేది"

(బ్రిటిష్ ఇండియాలో కమ్యూనిజం గురించిన రహస్య పత్రాలవాస్యం ఆధారం : ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ : 30-9-78)

ఎ. శంకర్

## ఎవరు హంతకులు?

అన్యాయమూ, అణచివేతా ఉన్నంత కాలం ప్రతిఘటన వుంటుంది. సంపూర్ణమైన ప్రజాహితమైన శక్తి పీడకులపై విరుచుకుపడేదాకా పోరాటం కొన సాగుతూనే ఉంటుంది....... నక్సలైట్లు బతకాలి-స్వేచ్ఛగా వుండాలి.

ఆంధ్రప్రదేశ్ జైళ్ళలో ఎందరో నక్సలైట్ ఖైదీలు వేడెక్కి ఉక్కిరి బిక్కిరయ్యే అసహ్యకరమైన యిరుకు అరలలో బందీలై, రోజులు లెక్కపెడు తున్నారు-వాళ్ళ కేసుల్ని తిరిగి పరిశీలిస్తామని ప్రభుత్వం సందిగ్ధంగా మాట యిస్తున్నది.

దేశం నిండా యింకా వందలకొద్ది (వేలకొద్దికూడా కావచ్చు) రాజకీయ ఖైదీలు జైళ్ళలో మగ్గుతున్నారు. వాళ్ళలో చాలామంది ఏళ్ళ తరబడి ఏ ఆరో పణలూ లేక, కనుచూపుమేరలో ఏ విచారణా లేక న్యాయానికి దూరంగా అమానుషమైన జైలు వాతావరణంలో చిత్రహింసల పాలవుతూ-ఇక జైలు వెలుపల మరింత విశాలమైన జైల్లో ఎందరో తరుమబడి, తన్నబడి పోలీసుల వేటలో 'ఎదురు కాల్పుల' (ఆట) లో ప్రాణాలు కోల్పోతున్నారు. ఈ దురన్యా యానికి బలైపోయిన అభాగ్యుల జాబితా తార్కుండే రిపోర్ట్‌లో కనిపిస్తుంది —

## ఎవరు వీరు?

సమాజానికి యింత నిరుపయోగమైన వారుగా వెలిగా చూడబడే యువ కులూ, వృద్ధులూ-ఎవరీ మనుషులు? వాళ్ళ నేరమేమిటి? స్థూలంగా వారిని 'నక్సలైట్లు' అని పిలుస్తారు-వాళ్ళు చేసిన తీవ్రమైన నేరం ఏమిటంటే మన జాతికి జీవగర్రలైన కోట్లాది రైతుల జీవితాలను తినేస్తున్న పేదరికం, దోపిడీ కేన్సర్ మూలాన్ని సవాల్ చేయ సాహసించారు. భూస్వాముల, పెత్తందార్ల భయంకర దోపిడీ దౌర్జన్యాలకు వ్యతిరేకంగా రైతాంగాన్ని కూడగట్టి బానిస బంధాలు తెంచుకునేందుకు వాళ్ళను సాయుధ పోరాటబాటకు నడిపిన త్యాగశీలు రైన, అత్యంత నిస్వార్థపరులైన, నిగ్గుతేలిన యువతీయువకులే యీ నక్సలైట్లు.

అవును అందుకే వాళ్ళు నేరాలు చేశారు. అందుకు మూల్యం చెల్లించాలి. అందుకే హింసను చేపట్టారు. దానికి మూల్యం చెల్లించాలి. ప్రభుత్వాన్ని ఎది

రించారు. అందుకు శిక్షను అనుభవించాలి. మంచి నడవడి కలిగి వుంటామనీ, సమాజంలోని అసమానతలను, పశుచర్యలను గుడ్డిగా సమర్థిస్తామని వాళ్ళు ప్రతిజ్ఞ చేయరు. అందుకే వాళ్ళు శిక్షింపబడాలి. దారుణంగా వాళ్ళను హత్య చేయడానికి తరచుగా ఉపయోగించే పదజాలమిది.

## దౌర్జన్యాల కొనసాగింపు

అయితే ప్రభుత్వమూ, పాలకవర్గాలూ, సంపన్నులూ, శ్రీమంతులూ, అపారమైన ఆస్తులవాళ్ళూ ఒక క్రమపద్ధతిలో, వ్యవస్థాపరంగా ప్రజలపై నర్మ గర్భంగా, బాహాటంగా కొనసాగించే హింసా దౌర్జన్యాల మాటేమిటి? ఒకవర్గంపై మరోవర్గపు క్రౌర్యాల, ఒక కులంపై మరోకులం కొనసాగించే పాశవికచర్యల సంగతేమిటి? రైతాంగం, కార్మికవర్గం, బలహీనవర్గాలపై జరుగుతున్న దారుణ మారణాల ఊసేమిటి? ముప్ఫయ్యేళ్ళుగా స్వాతంత్ర్యం పగటి వెలుగులో, కొనసాగుతున్న హింసా దౌర్జన్యాల పరంపర యిది.

ఇక్కడ కుళ్ళు రాజకీయవేత్తల డబ్బుదాహం, దుర్నీతి, అక్రమనిలువదార్ల, స్మగ్లర్ల, చీకటిబజారు వ్యాపారస్థుల, లాభార్జనాపరుల, హస్తలాఘవం గాళ్ళ బరితెగించిన లూటీ–ఈ రక్త పిశాచులంతా మనమధ్య–జాతికీ, అది పెంచుకున్న విలువలకూ, ఆశయాలకూ వ్యతిరేకంగా, వెన్నుపోటుగా పచ్చిమోసాన్ని, క్రూరమైన హింసను అమలు జరిపిన వీళ్ళంతా నేరస్థులు కారా? అహింసా గీతాల, మంత్రాలమధ్య వీళ్ళను ఎందుకు మరచిపోతున్నారు?

పచ్చి నిజం చెప్పాలంటే ఒక ఫ్రెంచి తత్వవేత్త అన్నట్టు "మనమంతా హంతకులం!"

అన్యాయం వున్నంతకాలం ప్రతిఘటన వుంటుంది. అణచివేత వున్నంత వరకు పోరాటం వుంటుంది. ప్రజాపీడన నిరంకుశత్వం వున్నంతకాలం తిరుగుబాటు వుంటుంది. ఇది అంతులేని ప్రతిఘటన– ఒక తల నరికేస్తే రెండు తలలు పుట్టుకొస్తాయి. నిర్మూలించి యీ అసంతశక్తిని తొలిగిద్దామనుకోవడం వృధా ప్రయత్నం.

సంపూర్ణమైన ప్రజాహితమైన న్యాయశక్తి పీడకులపై విరుచుకపడి కోట్లాది భారతీయ అభాగ్యుల పగ, కసి తీర్చుకునేదాకా పోరాటం కొనసాగుతూనే వుంటుంది.

(SUN)

సాహిత్య లేఖ :

# భూమికోసం సూచనలు-ప్రజాకళా రూపాలపై నా అభిప్రాయాలు

రుద్రజ్వాల

నా యక్షగాన నృత్యరూపకంపై అమరశిల్పి, అల్లం రాజయ్యగార్ల సూచనలు చదివాను. భూస్వామి ప్రజల ముందలా మాట్లాడతాడా అనేది అమరశిల్పి గారిప్రశ్న. ఎన్నికలముందెన్ని వాగ్దానాలు చేస్తారో, అయింతర్వాత తమ మనుగడకూ, తమ వర్గవ్యవస్థ వునికికీ యేమాత్రం ప్రమాదం వాటిల్లినా యెట్లా మాట్లాడతారో నేటి పాలకవర్గం సాక్షి. భూ సంస్కరణలు చేస్తామన్నవాళ్ళు' భూ స్వామ్యాన్ని పరిరక్షించటానికే ఇపుడు పూనుకుంటామని బాహాటంగా ప్రకటించటం- బూర్జువా ప్రజాస్వామ్యం ముసుగు గూడా చించేసుకుని యెట్లా వ్యవహరిస్తున్నారో దానికి సిరిసిల్లా, జగిత్యాలలేగదా తార్కాణం.

'నువ్వేమాలో ఒకడివే మాకడ్డంవత్తావా?' అన్నంతలోనే దావీదు మారడనేది శిల్పిగారి అభిప్రాయం. 'వూళ్లో వాళ్లం రైతుకూలీ సంగంగ యేర్పడి యీ భూమి దున్నుకుంటున్నమ'ని అబ్బురాం చెప్పినపుడు "యిది ఆసామి సబుకు తోట కిందిదంటగా' అనే దావీదు, అది బంజరని తెల్సినపుడు యిలాగే ప్రవర్తిస్తాడనుకుంటాను. ఆ వూళ్ళోనేగాక చుట్టుపట్ల పల్లెల్లోగూడా రైతుకూలీ సంగాల కదలిక కూలీల్లో ఒకడైన దావీదుపై యే ప్రభావాన్ని కల్గించదా? అందరూ దావీదులా వుండరనేదే నేనూచూపించింది. రంగస్థలంమీద చూపవీలులేని సంగపోల్ల అరకల్ని విప్పటాన్కి నేపథ్యంలో కొందరు భూస్వామికి దన్నుగాయటం చూపాను. అప్పటికి దావీదుపొందిన సామాజిక, రాజకీయ చైతన్యం 'భూస్వాముల భూముల్నితప్ప బంజర్లు ఆక్రమించవచ్చుననేది. ముందు బంజర్ల స్వాధీనతను యెదుర్కొనక సంగానికి చేయూతనీయటం, తర్వాత తనూ సంగంలో కల్సిపోవటం దావీదు పట్ల సమంజసమే ననుకుంటాను. ఇది నా అవగాహన యిచ్చిన అక్షరరూపం. అమరశిల్పి గార్ని మరోసారి చదవమని మనవి.

ముగింపు విషయం :

భూమికోసం సృజనలో వచ్చేముందు కె. వి. ఆర్. గారూ వచ్చింతర్వాత అల్లం రాజయ్య గారేగాక చదివినకొందరు మిత్రులూ రాజయ్య గారిలాంటి అభి

ప్రాయాన్నే వ్యక్తంచేశారు. మంచిసూచనే. కాని రాజయ్యగారు ఎలాఉంటే బాగుండేదో సూచిస్తే యింకాబాగుండేదీ; నిర్మాణాత్మకంగా వుండేది. 'నేడు సమ్మెలక్కూడా పోలీసుల ప్రతిఘటన యెదురవుతుంటే చివరిరంగంలో రైతు కూలీలు బంజరు భూములకోసం పోరాటానికుపక్రమించినపుడు కాకిచేత కబురంపితేచాలు కాకి బట్టలోళ్ళొచ్చేస్తారని భూస్వామిచేత చెప్పిస్తూనే (నేనురాసింది) వాళ్లు ప్రవేశంకాకుండా రాయటం సమంజసం కాదని చదివిన మిత్రులూ, కె.వి.ఆర్. గారూ యిచ్చిన సూచనలు, ఈ సూచనలు వాస్తవం. చరిత్రరుజువు చేస్తున్న నేటిస్థితి గతులు. కనుక వున్నదున్నట్లుగా గాక మార్చాలనేదే నా సంకల్పంకూడా.

ప్రజాకళారూపాల గురించి :

రాజయ్యగారి సూచనలు ప్రజారచయితలూ - కళాకారులూ అవశ్యం పాటించాల్సినవి. యక్షగాన రూపాలలాంటివి జనానికి బాగా పడ్తాయి. రాయొచ్చు వీటికి లయా, దరువులూ, నృత్యాలు ఎంతో దీక్షతో సాధనచేసే ప్రజా కళాకారులు కావాలి. రూపక ఇతివృత్తం ప్రజాజీవితాలను చూపెట్టేదీ, విప్లవాత్మకమయినదైనా కళాత్మకంగాని యేప్రదర్శనైనా పేలవంగా- నిర్జీవంగా తయారవుతుంది.

పాటలు జానపద బాణీల్లోనివైనా దృశ్యీకరింపబడినపుడు కలిగే 'యెఫెక్టు' విడిగా అంతగారాదు. దృశ్యరూపం తీసుకున్న వంగపండుగారి 'భూమి భాగోతం పాటలు' గద్దర్‌గారి 'దొరోడో డప్పులపాట'ల లాంటివి ప్రేక్షకులెంతగా కదిలిస్తాయో, వుత్తేజపరుస్తాయో ప్రేక్షకుల్లోంచి గమనించవచ్చు. విప్లవ భావుకతను స్పృశించి, పలికించగల గాత్రాలున్నపుడు వాటి 'ఇంపాక్టు' ప్రజలమీద యింకాబలంగా పడ్తుంది.

సామూహిక జానపద కళారూపాల్లో కోలాటం ఒకటి. తెలంగాణా ప్రాంతంలో 'దూల' లాగా ఇది యిప్పటికీ మా గ్రామీణప్రాంతాలలో అక్కడక్కడా ఆరిపోతూ, వెలుగుతూ మినుకు మినుకుమంటూ కన్పిస్తుంటుంది. 'ఇడ తయ్యకు తాధిమితా' అని చిరుతల్తో తాళంతెగగొట్టె కోలాటం ప్రారంభిస్తారు. కొందరు దీప స్తంభాన్ని పట్టుకొని తిరుగుతూ, యింటింటిముంగలా 'చక్రంకోపు' వేస్తారు. వారి భక్తిగీతాల బాణీల్లో ప్రజాసాహిత్యం చోటుచేసుకుంటే ప్రజాకళలు సార్థక్యం చెందుతాయి. 'కళకుప్రేరణా గమ్యస్థానం కళలే' గనుక వాటి ప్రయోజనము నెరవేరుతుంది. అందుకే ప్రపంచాన్ని మార్చటానికి

కళ అవసరమని ఎర్నెస్ట్‌ఫిషర్, 'శాస్త్రంచెప్పలేనిదీ మతం చెపుతానని భ్రమింప జేసిందీ, కళలుచెప్పగలుగుతాయ'ని క్రిస్టోఫర్ కాడ్వెల్ అంటారు.

పాడి పంటల్ సల్‌గుండాల అల్లాకేనాం
తల్లీ పిల్లల్ సల్‌గుండాల అల్లాకేనాం'

అంటూతిరిగే ఫకీరువేషం, పిట్టలదొరవేషం, బుడబుక్కల వానివేషం, చెంచీత మొదలైన పగటి వేషాలు మన ప్రజారంగస్థలానికి బాగా వుపయోగపడ్తాయి. నేల్లో గింజల్లాగ ప్రజల్లో, జీవితాల్లో, కలగలసిపోయి ప్రజాచైతన్యానికి జీవంపోసి మార్పు పంటకు దోహదంచేస్తాయి.

సినిమా ట్యూన్సునుగూడా మనం నిరసించాల్సిన పనిలేదనుకుంటాను. అవసరమైనవాట్ని, ప్రజలకెక్కేవాట్ని మనం తీసుకోవచ్చు. వాటి బాణీల్లో మనసాహిత్యాన్నిమిడ్చి పాడితే ప్రజాదరణనెట్లా పొందవచ్చో గద్దర్‌గారి 'సత్యమన్నా – కైలాసమన్నా', "అమరవీరుల్లార అందుకోండి జోహార్లు" సినీగీతాను కరణగీతాలే చెప్పక చెపుతాయి.

గేయంకన్నా గీతం, గీతంకన్నా దృశ్యగీతం, దృశ్యగీతంకన్నా యక్షగాన ప్రజారూపాలవంటివి ప్రజలకెక్కువ ప్రేరణనిస్తాయి. అయినా పాడేవారికే పాటలూ, యక్షగానాలూ పరిమితం. కాని నాటికలూ, నాటకాలూ అట్లాకాదు. భావస్ఫోరకంగా 'డైలాగ్సు' చెప్పగలవాళ్లు నటులుగా నటించవచ్చు. నాటకాన్ని శ్రామిక జనజీవితాల్ని జీవింపజేయవచ్చు. దానికి నిదర్శనం మొన్నటి 'మాభూమి' నాటకం. తెలంగాణ రైతాంగ పోరాటస్ఫూర్తిని స్పష్టంగా, సూటిగా స్పందించి ప్రజల్ని జాగృతంచేసి కళారంగం కర్తవ్యాలను చాటిచెప్పింది. (1947) మాభూమి నాటకంలో పట్టణాలను పట్టిపోయిన దేశముఖులు నిజాం పోలీసు సహాయంతో మళ్ళీ గ్రామాల్లోకి వచ్చి ప్రజల్ని హింసించటాన్ని ''పోతుగడ్డ' (1953) బలంగా చూపించింద.

'కళలు వ్యక్తిగతాలుకావు సామాజికాలు' (లెనిన్) అనినమ్మే సాహిత్యవేత్తలూ, కళాకారులు యివాల్టి కరీంనగర్, అదిలాబాద్ భూమిపోరాటాలగురించి నిమ్మకు నీరెత్తినట్లుండటం న్యాయం కాదు. ఇప్పటికైనా నాటక రచనకుపక్రమించటం బాగుంటుంది.

"సాహిత్యమూ కళా ఒట్టిగా పడుండటానికి కాదు. శత్రువునెదుర్కోటానికీ, అతనిబారినుండి కాపాడుకోటానికి అతని బారినుండి కాపాడుకోటానికి ఆయుధాలు కావాలి"—పికాసో.

(4వ కవరు నుండి)

## II సాంస్కృతిక కార్యక్రమాలు

13-1-79 రాత్రి 8 గం॥ : కవిసమ్మేళనం; అధ్యక్షత : నగ్నముని

14-1-79 రాత్రి 8 గం॥ సాంస్కృతిక కార్యక్రమాలు
జన నాట్యమండలి, అరుణోదయ వరంగల్, ఆదిలాబాదు, కరీంనగర్
మొదలయిన యూనిట్లు. నిర్వహణ : చెరబండరాజు

15-1-79 :- ఊరేగింపు : సాయంత్రం 5 గం॥ టౌన్‌హాల్, హనుమకొండ
నుంచి ఇస్లామియా జూనియర్ కాలేజ్, వరంగల్ వరకు.

బహిరంగసభ : రాత్రి 7 గం॥కు అధ్యక్షత : వరవరరావు

వక్తలు : కె. వి. రమణారెడ్డి, వై. కాశీపతి, కె. హనుమంతరెడ్డి,
త్రిపురనేని మధుసూదనరావు

సాంస్కృతిక కార్యక్రమాలు : హైదరాబాదు, విశాఖ జన నాట్యమండలులు,
అరుణోదయ.

### సూచనలు

1. ఇతర ప్రాంతాలనుంచి వచ్చేవారికి రెండుపూటల భోజనము, ఉండ టానికి వసతి ఏర్పాట్లు వుంటాయి. రుసుము 10 రూపాయలు.

2. పాఠశాల ప్రాంతంలో టిఫిన్, టీ, కాఫీలు చేరువలో లభించే ఏర్పాటు జేయబడుతుంది. కన్సెషన్ రేటులో లభిస్తాయి.

3. వరంగల్‌లో చలి కాస్త ఎక్కువ. చలినుంచి రక్షణకు అవసరమైన ఏర్పాట్లతో ప్రతినిధులు రావాలి.

4. వసతి, భోజనము- ఇస్లామియా జూనియర్ కాలేజ్, వరంగల్. వరంగల్ రైల్వేస్టేషన్‌నుంచి హనుమకొండకు వచ్చే బస్సు ఎం.జి.ఎం. ఆసుపత్రి దగ్గర దిగితే కుడిచెయ్యివైపు కనిపిస్తూ వుంటుంది. అలాగే కాజీపేట రైల్వే స్టేషన్లోదిగి హనుమకొండ బస్సు స్టేషన్‌నుంచివచ్చే వారికి ఎం.జి.ఎం. వద్దదిగితే ఎడమచెయ్యివైపు నాలుగడుగుల దూరం.

5. ఎటునుంచైనాసరే ట్రెయిన్‌లో వచ్చేవాళ్ళు, వరంగల్ మీదుగా బస్సులో వచ్చేవాళ్లు వరంగల్ స్టేషన్‌లో దిగితే దగ్గరగా వుంటుంది.

**SRJANA Telugu Monthly Jan. 79 H/WL-10**

Regd. No. with Registrar of News Papers 10953/67

# విప్లవ రచయితల సంఘం — సాహిత్య పాఠశాల

జనవరి 13, 14, 15 వరంగల్

## I పాఠశాల కార్యక్రమాలు

13-1-79 ఉ॥ 10 గం :- భారతదేశ చరిత్ర-శాస్త్రీయ దృక్పథం
అధ్యక్షత: త్రిపురనేని మధుసూదనరావు; వక్త: కె. వి. రమణారెడ్డి

13-1-79 మధ్యాహ్నం 2 గం:- చరిత్ర-సాహిత్యచరిత్ర
అధ్యక్షత : చేకూరి రామారావు; వక్త : త్రిపురనేని మధుసూదనరావు

14-1-79 ఉ॥ 9 గం :- భాషా, సాహిత్యోద్యమాలు
అధ్యక్షత : కె. వి. రమణారెడ్డి; వక్త : పి. సి. నరసింహారెడ్డి

14-1-79 ఉ॥ 10-30 గం॥లు :- నూతన ప్రజాస్వామ్యవిప్లవంలో సాహిత్యం పాత్ర
అధ్యక్షత : కె. హనుమంతరెడ్డి వక్త : చలసాని ప్రసాద్

14-1-79 మధ్యాహ్నం 2 గం॥ :- ప్రజలు పాటలు
అధ్యక్షత : చెరబండరాజు

అనుభవాలు : గద్దర్, వంగపండు ప్రసాదరావు, రామారావు

15-1-79 ఉ॥ 9 గం :- నవల-కథ- జీవితం
అధ్యక్షత : అల్లం రాజయ్య వక్త : కాళీపట్నం రామారావు

పై కార్యక్రమాల్లో విరసం సభ్యులు, సభ్యులచే సిఫారసు చేయబడిన అభిమానులు మాత్రమే పాల్గొనవచ్చు.

(మిగతా 3వ కవరులో)